# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

*[ Part II—Proceedings other than Questions and Answers ]*

## OFFICIAL REPORT

---

*Twenty-Second Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 22nd November, 1957*

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## BUSINESS OF THE HOUSE

శ్రీ యం. యస్. రాజలింగం (చెర్లించర్ల) అధ్యక్షా, నేషనలైజేషన్ ఆఫ్ టెక్స్టుబుక్స్ విషయంలో నేను ఒక స్వల్పవ్యవధి ప్రశ్న పంపించినాను ఈ రోజుతో యీ సమావేశం ముగియబోతోంది కనుక మిగతా వివరాలు మంత్రిగారు ఆన్సర్ చేసినా, చేయకపోయినా యీ ఒక్క విషయం మాత్రం చెప్పమని అడుగుతున్నాను.

*Mr. Speaker*. That short-notice question is not coming up today...

**Sri M. S. Rajalingam:* I want to ask some information, Sir, because this meeting is coming to a close today.

మిస్టర్ స్పీకర్ .: ఇటువంటివి రూలు 70, 74, 68 ల క్రింద రావాలి. ఒక్క గా. మెంబరు గారికి నేను యిట్లా అవకాశం యిస్తే మిగతావారందరూ

అడగరా? మీరు, నేను, మంత్రిగారు—మనం ముగ్గురమే యిక్కడ వుంటే నాకు అభ్యంతరం లేదు అందువల్ల తామే పర్సనల్‌గా మంత్రిగారిని కలుసుకొని అన్ని విషయాలూ కనుక్కోండి

శ్రీ యం. యస్ రాజలింగం నేను ప్రశ్న అడగడం లేదు

*Mr Speaker* Then, is the hon member moving a Motion?

*Sri M S Rajalingam* I am not moving a Motion, Sir

*Mr Speaker* Then, what?

శ్రీ యం. యస్. రాజలింగం ఏదైనా నేషనలైజ్ చేసినప్పుడు నిరుద్యోగతను పెంచకుండా చేయాలనేది ప్రభుత్వంయొక్క ఉద్దేశం అవునా, కాదా?

మిస్టర్ స్పీకర్ మీకు ఏమి కావాలి?

శ్రీ యం యస్ రాజలింగం నేను పాయింట్ ఆఫ్ ఇన్‌ఫర్‌మేషన్ అడుగుతున్నాను.

*Mr. Speaker* I am not going to allow

*ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి) పాయింట్ ఆఫ్ ఇన్‌ఫరమేషన్ అన్నా, మరే పేరు పెట్టినా కూడా ప్రతి ప్రశ్నకూ కొంత ఇన్‌ఫర్‌మేషన్ కావాలి Every question is for eliciting some information. రూలు '74', '64' యిటువంటివన్నీ ఉన్నాయి అవన్నీ కాకుండా యింకొక '4' పెడతామంటే ఎట్లా?

మిస్టర్ స్పీకర్ · Rule 70 క్రింద ఇద్దరు గౌరవసభ్యులు ఒక notice యిచ్చారు. 2 గంటల చర్చకు permission యివ్వించాలని కోరారు ఆయిద్దరూ శ్రీ బి. రత్నసభాపతి, శ్రీ బి. శ్రీరామమూర్తి గారలు. కాని యిందులో ఒక technical objection ఉన్నది. ఒకరు ఇవ్వవలె, దానిని ఇద్దరు support చేయవలె, ముగ్గురులేరు కనుక దీనిని నేను disallow చేస్తున్నాను. ఇక యింతకంటె ఏమీలేదు.

*శ్రీ ఎ. ఎరుకునాయుడు (సాలూర్-జనరల్). దేనినిగురించి యిచ్చారో House కు తెలియదు.

మిస్టర్ స్పీకర్ దేనినిగురించి notice యిచ్చారో తెలియనక్కరలేదు

I have disallowed the Motion and the concerned hon Members are informed accordingly

*శ్రీ బి. రత్నసభాపతి (బద్వేల్): ఆ technical objection గురించి మనవిచేస్తాను

మిస్టర్ స్పీకర్ అవసరంలేదు.

*శ్రీ బి. రత్నసభాపతి తమ Ruling పైన నేనేమీ చెప్పడంలేదు

మిస్టర్ స్పీకర్ ప్రత్యేకమైన privileges ఎవరికీ యివ్వడానికి వీలు లేదు Therefore I cannot allow the hon Member to speak

*Sri B Ratnasabhapathi* I request the Chair to allow us to speak

*Mr Speaker* No, there is an end of the matter

(*Sri B Ratnasabhapathi rose in his seat*)

*Mr Speaker* The Rule says 'supported by two other members' I depend upon my knowledge of the Rule, my interprepation of the Rule, which I have read particularly for this purpose this morning One Member may move, but it must be supported by two other Members Therefore the leader of the Socialist Party is informed that I am right and I am not going to allow him to say anything on this matter

శ్రీ బి శ్రీరామమూర్తి (విజయనగరం) On a point of Order, Sir ఎవరైనా ఒక సభ్యుడు ఒక Motion ఇచ్చినపుడు, దానిని rule out చేసినా, ఏ సందర్భంలో ఏ subject మీద Motion ఇచ్చినారో తెలియపరచకుండా rule out చేస్తే rule out చేసినట్లు ఇక్కడ చెప్పడం మానివేయవచ్చునేమో

మిస్టర్ స్పీకర్. Chamber లోనే rule out చేసి తెలిపితే సరిపోతుంది. కాని మీకు ఇక్కడ తెలిపితే మంచిదని చెప్పాను. To help the hon. Members I have given this information Otherwise I would have done so.

## MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES
### (1) RE FIRE ACCIDENT IN BELLUPADU

*Mr. Speaker* I have received a Motion under Rule 74 of the Assembly Rules from hon Sri U. Rangababu It reads like this

"I want to draw the attention of the hon Revenue Minister to the great havoc caused by fire in Bellupadu, Ichapuram on 13-11-57 resulting in loss of lives and property and request to know what action the Government have taken by way of relief"

The hon. Revenue Minister may say some thing on this

*రివెన్యూ శాఖమంత్రి (శ్రీ కె వెంకటరావు) చాలా ఇళ్ళు తగులబడిపోయినాయి. వారందరికి సహాయం చేయవలసినదని కలెక్టరులకు ఉత్తరువులు పంపించాము మిగిలిన వివరాలు ఇంకా రాలేదు చేసిన సహాయం సరిపోక, ఇంకా ఏమైనా కావాలంటే నాకు వ్రాయవచ్చు. అందువల్ల దీనిని గురించి నేను చెప్పగలిగినది ఇంతకన్న ఎక్కువగా లేదు

### (2) RE CLOSURE OF GARIVIDI MINES

*Mr Speaker* · The hon Member Sri M. Satyanarayana Raju wants to bring to the notice of the hon Chief Minister the abnormal situation arising out of the closure of manganese mines

శ్రీ యన్ సంజీవరెడ్డి దీనినిగురించి చాలాసార్లు చెప్పడం జరిగింది. No additional information is required, Sir.

శ్రీ ఎమ్. సత్యనారాయణరాజు (చీపురుపల్లి - జనరల్) అధ్యక్షా, ఈ మాంగనీస్ గనులలో 10, 15 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు. ఇప్పుడు ఆ mines మూసివేయడంవల్ల వారికి పనిదొరుకుటలేదు అసలే చీపురుపల్లి తాలూకా మెట్టప్రాంతం. దానికితోడు వర్షాలులేక పంటలు పండకపోవడం వల్ల ఆ ప్రాంతంలో చాలాతీవ్రమైనకరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. కాబట్టి చీపురుపల్లి తాలూకాను కరువుప్రాతంగా declare చేయవలసినదిగా ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను.

*Mr. Speaker*: If the hon. Member has anything to say in the matter, he can write to the hon. Chief Minister who will consider it and do all that is possible.

* శ్రీ ఎన్ సంజీవరెడ్డి నేను డిసెంబరు నెలలో 2 వ తేదీనుంచి 6 వ తేదీ వరకు అక్కడ tour చేస్తున్నాను అక్కడ క్షామం ఎంతఉన్నదో పరిశీలించిన తరువాత ఉద్యోగస్తులు చర్య పుచ్చుకోవాలి గాని వెంటనే famine area గా declare చేయడానికి వీలులేదు

## (3) RE DISPUTE BETWEEN SUGARCANE GROWERS AND MILLOWNERS OF SAMALKOT

మిస్టర్ స్పీకర్ తూర్పుగోదావరి జిల్లా పిఠాపురము ప్రాంతంలోని చెరుకు పండించే రైతులకు చక్కెర ఫాక్టరీ యజమానులకు ఉన్న వివాదం గురించి ఒక తీర్మానం వచ్చింది దానిని గురించి కార్మికశాఖమంత్రిగారు ఏదైనా తెలియజేస్తారా ?

సాంఘిక సంక్షేమశాఖామంత్రి (శ్రీ డి. సంజీవయ్య) కార్మికులకు యజమానులకు వివాదంలేదు వారికి వివాదాలు ఉండే సందర్భంలో కార్మిక శాఖ ఉద్యోగులు వెళ్లి రాజీ కుదిర్చారు. ఒక ఒప్పందం వ్రాసుకొన్నారు అది 1-9-57 నుంచి అమలులోకి వచ్చింది కార్మికులకు, యజమానులకు మధ్యను ఏలాంటి వివాదాలు లేవు. రైతులకు యజమానులకు, మధ్య కొన్ని విభేదాలు వచ్చినట్లు, కొన్ని ఇబ్బందులు ఏర్పడినట్లు తెలిసింది. ఆ విషయంలో Agricultural Department వారు చాలా శ్రద్ధ తీసుకొని పరిశీలన చేస్తున్నారు. త్వరలోనే వారు పరిష్కారం చేస్తారు అందువల్ల కార్మికశాఖకు సంబంధించి నంతవరకు ఎట్టి ఆవశ్యకతలేదని తమకు నివేదించుకుంటున్నాను.

*Mr. Speaker*. The Agriculture Department is taking all the steps necessary. Therefore this Motion is disallowed

## PRESENTATION OF THE REPORTS OF THE COMMITTEE ON PRIVILEGES IN NIPPANI CASE AND VAVILALA GOPALAKRISHNAYYA CASE

*Sri Konda Lakshman Bapuji (Chinakonda)* · Mr. Speaker, Sir, I beg to present the Reports of the Committee on Privileges on the following two questions of privilege

(i) Question of privilege which was referred to the Committee on 6-5-1957 (The Nippani case).

(ii) Question of privilege which was referred to the Committee on 12-7-1957 (The Vavilala Gopalakrishnayya case)

*Mr Speaker* Reports presented

శ్రీ పి సత్యనారాయణ (సామర్లకోట) శ్రీ గోపాలకృష్ణయ్యగారి కేసు విషయంలో ఉద్దేశ పూర్వకంగా స్టేటుమెంటు చేయబడక పోయినప్పటికి స్టేట్‌మెంటు సక్రమంగాలేదని తెలిసినదికాబట్టి దానినిగురించి ప్రభుత్వం ఏమైన చర్య తీసుకుంటుందా ?

మిస్టర్ స్పీకర్ ఈ విషయాలు అసెంబ్లీముందుకు వచ్చినపుడు చర్చ చేయవచ్చు

*శ్రీ ఎస్. కాశిరెడ్డి (పొదిలి) 74 వ నిబంధనక్రింద ఒక తీర్మానం తెచ్చాను దానికి రెవిన్యూమంత్రిగారు సమాధానం చెప్పలేదు

శ్రీ కె. వెంకటరావు నావద్ద information సిద్ధంగాలేదు

మిస్టర్ స్పీకర్ ఈ విషయం గురించి రెవిన్యూ మంత్రిగారికి వ్రాసి తెలుసుకోవలసినదిగా శ్రీ కాశిరెడ్డిగారికి తెలియజేస్తున్నాను

శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం-జనరల్)· అధ్యక్షా, తమకు ఒక పిటీషన్ పంపించాను.

*Mr. Speaker* The petition must be presented under particular rule. నాకు పిటీషన్ పంపించి లాభం లేదు. అసెంబ్లీముందు చర్చింపబడుతున్న అంశానికి సంబంధించినదై ఉండాలి. అట్టి పరిస్థితులలోనే అసెంబ్లీకి ప్రతినిధిగా నేను దానిని అసెంబ్లీకి సమర్పించడం జరగవలసి వుంటుంది. It is, therefore, out of order. Therefore I have disallowed it (Interruption) Without my permission nothing could be read in the House; nothing could be talked in the House.

## THE ANDHRA PRADESH COMMERCIAL CROPS (ASSESSMENT) BILL, 1957

*Clause* 4 (contd )

*Sri G Yellamanda Reddi (Kanigiri)* Mr Speaker, Sir, I beg to move

"In lines 4 and 5 of Sub-clause (1) of clause 4, delete the words 'on receipt of an application from the person liable to pay the special assessment on such land' "

*Mr Speaker* Motion moved

*శ్రీ జి యలమందారెడ్డి రెమిషన్ యిచ్చే సందర్భంలో రైతు దరఖాస్తు పెట్టుకోవాలని ఈ క్లాజులో చెప్పబడింది సాధారణంగా రెవిన్యూ ఉద్యోగులు అజమాయిషీ చేయడం పంట నిర్ణయించడం జరుగుతూ వుంటుంది కాలమాన పరిస్థితులు ఎలా ఉన్నది, పంట పరిస్థితి ఎలా ఉన్నది వారే చెపుతూ ఉంటారు రెమిషన్ యివ్వడం అనేదికూడ ఈ రిపోర్టు ఆధారంగానే జరుగుతూ ఉంటుంది అటువంటి పరిస్థితులలో రైతు దరఖాస్తు పెట్టుకోవాలనడం సమంజసంగా కనపడడం లేదు.

* శ్రీ కె వెంకటరావు రెండవక్లాజు, రెమిషన్ విషయములో చాలా liberal గా ఉంది కొన్ని ప్రత్యేకమయిన సందర్భాలలో రైతుకు నష్టం కలిగినపుడు దరఖాస్తు పెట్టుకుంటే రైతుకు సుఖంగా ఉంటుంది ప్రభుత్వానికి ఆలోచించడానికి వీలుంటుంది అందువలన ఈ సవరణను అంగీకరించడానికి వీలులేదు.

*Mr Speaker*: The question is .

"In lines 4 and 5 of sub-clause (1) of clause 4, delete the words 'on receipt of an application from the person liable to pay the special assessment on such land'."

The motion was negatived.

* *Sri Pillalamarri Venkateswarlu (Nandigama)*. Sir, I beg to move ·

"In line 5 of sub-clause (1) of clause 4, after the words 'on such land' insert the following-'or on the receipt of the reports from the village Karnam or Munsif (upon whom it is but obligatory to send such reports) under such circumstances'."

*Mr. Speaker*: Motion moved.

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు నేచురల్ కెలామిటి వచ్చినప్పుడు అంటే అతివృష్టి అనావృష్టులవల్ల పంటలు నాశనమైనప్పుడు గ్రామోద్యోగులే ప్రభుత్వానికి నివేదికలు పంపుతూ ఉంటారు ఆ నివేదికలను బట్టి ప్రభుత్వము రెమిషన్ మంజూరు చేయవచ్చు అంతేకాని రైతు ప్రత్యేకంగా దరఖాస్తు పెట్టుకోవాలనడం న్యాయంగా లేదు రైతులు దరఖాస్తులు పెట్టుకోగలిగినంత విద్యావంతులు కాకపోవచ్చు కాబట్టి నా సవరణను అంగీకరించవలెనని కోరుచున్నాను మంత్రిగారు తరువాత క్లాజుగురించి చెప్పారు ఆ క్లాజు ధరలలోని తేడాలకు సంబంధించినది మాత్రమే కాబట్టి దానికి దీనికి సంబంధంలేదు.

Sub-clause 4 (2) reads

"The Government may remit in whole or in part, the special assessment payable under this Act in respect of any crop, in any area or areas, if they are satisfied that such remission is necessary on account of fall in prices of such crop, or other sufficient cause", అని ఉంది అందువల్ల నా సవరణను అంగీకరించగోరుతాను

శ్రీ కె వెంకటరావు ఈ సవరణ అవసరంలేదు ఇదివరకు ఉన్న రెమిషన్ నిబంధనలు ఈ additional tax కు కూడా వర్తిస్తాయి

*Mr Speaker* The question is:

"In line 5 of sub-clause (1) of clause 4, after the words 'on such land' insert the following—

'or on the receipt of the reports from the village Karnam or Munsif (upon whom it is but obligatory to send such reports) under such circumstances'."

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu*: I demand division, Sir.

The House then divided.

Ayes : 44; — Noes : 84

The motion was negatived

శ్రీ బి శ్రీరామమూర్తి Seasonal conditions వల్లగాని, natural calamities వల్లగాని పంటలకు నష్టంవస్తే రెమిషన్ ఇస్తామని చెబుతున్నారు. అయితే క్లాజులో "such remission" అనే మాటలు వాడబడ్డాయి! ఈ "such

remission" అనేదానిలో పూర్తి రెమిషన్ అనేది కూడా చేరిఉన్నదో లేదో స్పష్టంగాలేదు ఈ విషయమై clarification కావాలి "Such remission" అంటే పూర్తి రెమిషన్ కూడా చేరిఉన్నట్లయితే నా సవరణ (నెం 39) అవసరం లేదు

శ్రీ కె వెంకటరావు "Such" అనేదానిలో "పూర్తి" ఆనేదికూడా include అయినది

(నెం 39 వ సవరణ ప్రతిపాదింపబడలేదు)

* *Sri V Visweswara Rao (Mylavaram)* I beg to move

"In lines 5 to 8 of sub-clause (1) of clause 4, for the words 'order such remission of special assessment as he may consider just in the circumstances of the case, subject to rules, if any made in this behalf', substitute the words 'order full remission of special assessment if the yield estimate of the crop is fifty naye paise and below in a rupee' "

*Mr Speaker* Motion moved.

**Sri V Visweswara Rao* I beg to move

"In lines 5 to 8 of sub-clause (1) of Clause 4, for the words 'order such remission of special assessment as he may consider just in the circumstances of the case, subject to rules, if any, made in this behalf', substitute the words 'order full remission of special assessment if the yield estimate of the crop is thirty seven naye paise and below in a rupee' "

*Mr Speaker* Motion moved

* శ్రీ వి. విశ్వేశ్వరరావు . అధ్యక్షా, రెమిషన్ రూల్సు యిదివరకే ఉన్నవని, యిప్పుడు అవసరంలేదని మంత్రిగారు చెప్పారు కాని ఆ రూల్సులో చాలా విషయాలు ఉన్నవి నాలుగణాలకన్న తక్కువపంట పండినప్పుడే, రెమిషన్ యివ్వటం జరుగుతుంది కాని, మిగిలిన సందర్భములలో రెమిషన్ యివ్వబడటంలేదు మేము కోరినది—ఎనిమిదణాల వంతైనా పండనప్పుడు రిమిషన్ యివ్వాలని సవరణ పెట్టాము. ఈ వాణిజ్యపంటలలో, రైతుకు వ్యవసాయఖర్చులే గిట్టుబాటు కావు. పెట్టుబడికి నష్టం కలుగుతున్నది అనేక

సందర్భాలలో, ప్రభుత్వానికి పన్ను అప్పుచేసి కట్టవలసి వస్తోంది పంటకొరకే అప్పుచేసి పెట్టుబడి పెట్టినరైతు, ప్రభుత్వానికి కూడ అప్పుచేసి కట్టాలంటే చాలా బాధపడుతున్నాడు ఇటువంటి పరిస్థితులలో రైతులమీద అదనంగా అప్పులభారం వేయకుండా, పంట 0-8-0 కు తగ్గితే పూర్తిగా రెమిషన్ యివ్వమని కోరుతున్నాము అది అంగీకరించుటకు వీలులేకపోతే 37 నయా పైసలకు తక్కువవుంటే రెమిషన్ యివ్వాలన్న సవరణ ఆమోదించండి ఈ రెండింటిలో దేనిని అంగీకరించినా సంతోషమే

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఏది అంగీకరించటానికి వీలులేదు దీనివల్ల మొత్తం రెమిషన్ సిస్టమ్ అంతా change చేయవలసి వస్తుంది. Extra tax కు ఒకరూాలు, basic tax కు ఒక రూాలు పెట్టటానికి వీలులేదు జనరల్‌గా దెబ్బతిన్నప్పుడు మేము ఆలోచించటానికి వీలుంటుందిగాని, ఒక condition పెట్టి యింతపంట పండితే యింత రెమిషన్ అని అంటే, ఎవరు వెళ్ళిచూస్తారు? ఏవిధంగా నిర్ణయిస్తారు? అసాధ్యమవుతుంది కాబట్టి యీ రెండు సవరణలు నేను అంగీకరించను

*Mr Speaker* The question is

"In lines 5 to 8 of sub-clause (1) of clause 4, for the words 'order such remission of special assessment as he may consider just in the circumstances of the case, subject to rules, if any, made in this behalf', substitute the words 'order full remission of special assessment if the yield estimate of the crop is thirty seven naye paise and below in a rupee'."

The motion was negatived.

*Mr Speaker*: The question is

"In lines 5 to 8 of sub-clause (1) of clause 4, for the words 'order such remission of a special assessment as he may consider just in the circumstances of the case, subject to rules, if any, made in this behalf' substitute the words 'order full remission of special assessment if the yield estimate of the crop is fifty naye paise and below in a rupee'"

The motion was negatived

* *Sri B. Sankariah* · I beg to move:

"For the existing sub-clause (2) of clause 4, substitute the following—

'(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy-five per cent of the average price prevailing during 1950-55' "

*Mr Speaker* Motion moved

*Sri B Sankariah* I beg to move

"For the existing sub-clause (2) of clause 4, substitute the following

'(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy-five per cent of the average price prevailing during the previous five years' "

*Mr Speaker* Motion moved.

*Sri B Sankariah* I beg to move

"For the existing sub-clause (2) of Clause 4, substitute the following—

'(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy five per cent of the average price prevailing during the previous three years' "

*Mr Speaker*: Motion moved.

*Sri B Sankariah* I beg to move

"For the existing sub-clause (2) of Clause 4, substitute the following—

'(2) The Government shall remit half the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to the average price prevailing during the last five years'."

*Mr. Speaker* Motion moved

* *Sri B. Srirama Murthy.* Sir, I beg to move

"In line 3 of sub-clause (2) of Clause 4, after the words 'in any area or areas', insert the words 'where the price level in respect of any crop specified in the schedule falls by 25% of the average price obtaining during the previous three years or any other sufficient cause'"

*Mr Speaker* Motion moved

*Sri M Satyanarayana Raju* Sir, I beg to move

"In line 1 of sub-clause (2) of clause 4 for the word "may" substitute the word "shall""

*Mr Speaker* Motion moved

శ్రీ బి శంకరయ్య అధ్యక్షా, నేను యీ సవరణ ప్రతిపాదిస్తున్నాను ప్రత్యేకమైనపన్ను వేసేటప్పుడు. అసలు పంట ఎంత పండాలో నిర్ణయం చేయాలనే సవరణతెస్తే, అది ఒప్పుకొనలేదు. అందువల్ల రెమిషన్ వచ్చే అవకాశం లేకుండా పోయింది కనీసం ఖర్చులుకూడ గిట్టుబాటుగాని పంటలు ఉన్నాయి పసుపుపంట విషయంలో, పెట్టిన పెట్టుబడిలో సగం ఖర్చులయినా గిట్టుబాటు అయ్యేటట్లుగా ధరలులేవు. ఇదివరకు పసుపు వేసినవారు చాలమంది, ఆ పంట గిట్టుబాటు కాకపోవటంవల్ల, పొలాలు అమ్ముకొని దివాలా తీయవలసిన పరిస్థితిలో ఉన్నారు. ధరలు గిట్టే పరిస్థితులు లేకపోతే ఆలోచించి రెమిషన్ యిస్తామన్నారు. అటువంటప్పుడు, స్పష్టంగా ఒక పరిమితికి ధర పడిపోతే రెమిషన్ యిస్తామని చెప్పాలి లేకపోతే రైతులకు రెమిషన్ అందే అవకాశం ఉండదు. నోరున్న పెద్దవారికి వీలుంటుందికాని చిన్న రైతులకు రెమిషన్ దొరకదు. ధరలు పడిపోతే రెమిషన్ యివ్వటానికి అవకాశం ఉన్నప్పుడు చట్టములో స్పష్టంగా లేకపోతే ఆ ప్రకారం రూల్సు తయారు చేయుటకు అవకాశం ఉండదు. చట్టములో స్పష్టమైన provision లేకపోతే అనేక చిక్కులు ఉంటాయి. ప్రభుత్వం యిస్తానన్న రెమిషన్, రైతులు పొందుటకు వీలులేకుండా పోతుంది. ప్రభుత్వం యిస్తామంటున్న రెమిషన్ ధరలు యీ పరిమితికి పడిపోతే యింత యిస్తాము అని చట్టములో స్పష్టమైన ప్రొవిజన్ పెట్టి ఆ ప్రకారం రూల్సు తయారుచేస్తే, ఆవిధంగా యివ్వమని రైతులు అడుగుటకు వీలుంటుంది. లేకపోతే అధికారుల యిష్టంవచ్చినట్లు చేయటానికి వీలవుతుంది. ఇప్పుడున్న పరిస్థితులలో ఇన్‌ఫ్లేషన్‌వల్ల ధరలు జాస్తిగా పెరుగుతున్నప్పటికీ, కొన్ని

పంటలకు ధరలు పడిపోవుట చూస్తున్నాము ధరల మాంద్యంవల్ల. పసుపు విషయంలో రైతులకు దెబ్బతగిలింది బెల్లమువల్ల కూడ రైతులు నష్టపడు తున్నారు బయటి దేశాలలో మంచిధర ఉన్నప్పటికీ గవర్నమెంటువారి పాల సీవలన export చేయుటకు వీలులేకుండా ఉన్నది మిరపకాయలకు transport సౌకర్యం లేనందున బయటకు పంపి రావలసిన ధర రాబట్టుటకు వీలు లేకుండా ఉన్నది సరైన ధరలు రాబట్టుటకు ప్రభుత్వం అవకాశాలు కలుగజేయుట లేదు ధరలు పడిపోయినా స్పెషల్ టాక్సులు వేస్తామంటారు పంట పోయి నప్పుడు రెమిషన్ యిస్తామని అంగీకరిస్తూ, దానికి specific గా చట్టంలో provision పెట్టకపోతే, ఆ బెనిఫిట్ ఎవరికీ లేకుండా పోతుంది ఫలానా కండిషన్సులో రెమిషన్ యిస్తామని చట్టంలో ఉంటే, తరువాత రూల్సులో కూడ వివరంగా వ్రాయవచ్చును లేకపోతే సామాన్యరైతు ఆ లాభం పొంద టానికి వీలులేకుండా పోతుంది కాబట్టి యీ సవరణకైనా అంగీకరించాలని కోరుతున్నాను.

శ్రీ డి. నరసయ్య (హుజూర్‌నగర్) అధ్యక్షా, అరు అణాలు, అర్ధ రూపాయి పంట పోయినపుడు, రెమిషన్ ఇవ్వాలనేదానిని మంత్రిగారు అంగీక రించలేదు ధరలు పడిపోయినపుడు, రైతులు అనేక కష్టాలు అనుభవిస్తున్నారు కేవలం లాభం సంపాదించటంకోసమే రైతు పత్తి పండించటంలేదు. రైతు తనకు ఉన్న భూమిలో కొంత పునాసపైరు వేసుకొని మిగతా భూమిలో పత్తి వేసుకొంటాడు తన ఎద్దులకు కావలసిన పత్తివిత్తులుకోసం పండించుకొనే పంట మీదకూడ పన్ను వేయటం సబబుకాదు పత్తికి ఒక స్థిరమైన ధర లేక, ఇవాళ పత్తి పండించుకొనే రైతు పత్తి 70 రు లకు అమ్ముకోవలసిన దుర్గతి ఏర్పడింది. ఆ రైతుకు యీ పన్నులు చెల్లించుకోలేని పరిస్థితి ఏర్పడుతోంది ఈ సంవత్సరం శెనగకాయ ధర 80రు లున్నది. ఆ ధర ఎప్పుడూ ఇలాగే ఉంటుందనే నమ్మకం లేదు. ఆ పంటకు పెట్టవలసిన పెట్టుబడి పెరిగిపోతోంది భూమిసారం తగ్గి, పంటలు తగ్గిపోవటం జరుగుతోంది. వర్షాలు సరిగా పడకపోవటంవల్ల, పురుగు, చీడ పట్టటంవల్ల, పంటలు విపరీతంగా దెబ్బతినటం, రైతు పెట్టిన పెట్టుబడికూడ రానటువంటి పరిస్థితులు ఏర్పడటం మనము చూస్తున్నాము. మార్కెటులో ధరలు స్థిరంగా లేని యీ పరిస్థితుల్లో, వీటిపైన పన్ను వేయటం సరైందికాదు. కాబట్టి, యీ సవరణను మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను ఆ విధంగా అంగీకరించకపోతే, రైతాంగంమీద చాలా భారం మోపినట్లు అవుతుందని చెబుతున్నాను. కనీసం "ఇంత ధర పడిపోయినపుడు, ఇంత శిస్తు

తీసుకోము" అన్న సూత్రాన్ని తప్పకుండా మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ బి. శ్రీరామమూర్తి అధ్యక్షా, పంటలధరలు తగ్గినట్లయితే రెమిషన్ ఇవ్వాలని ప్రభుత్వానికి అభిప్రాయము ఉన్నది అయితే, ఏమాత్రం ధర తగ్గితే, రెమిషన్ ఇవ్వాలన్నది, నిర్ణయించే అధికారం ఆఫీసర్ చేతుల్లో ప్రభుత్వం ఉంచుతోంది అది సరైన పద్ధతికాదు స్థిరంగా, స్పష్టంగా, ఇప్పుడే ఒక నిర్ణయం కావాలి ధరలు ఏమాత్రం తగ్గితే, ఎంత రెమిషన్ ఇవ్వాలన్నది ప్రభుత్వం ఇప్పుడే నిర్ణయం చేయటం సబబుగా ఉంటుంది కాబట్టి, ఈ క్లాజులో గత మూడు సంవత్సరాలలో ఉన్న యావరేజి ధరలో, నూటికి ఇరవై ఐదు వంతుల ధర తగ్గినపుడు, ప్రభుత్వం తప్పనిసరిగా రెమిషన్ ఇచ్చితీరాలని స్పష్టంగా ఉండాలి 25 కాకపోతే, 35 పెట్టండి, లేదా 45 పెట్టండి, ఎంత పెట్టినా, ఇప్పుడే అది స్పష్టంగా నిర్ణయం కావాలి ఇది ఆ రకమైన సవరణ కాబట్టి, మంత్రిగారు దీనిని ఆమోదించాలని కోరుతున్నాను

శ్రీ యం. సత్యనారాయణరాజు అధ్యక్షా, ఈ క్లాజు 4 లో నేనొక అమెండ్‌మెంట్ ఇచ్చాను The clause reads thus

"Where there has been a failure of crops in any year due to seasonal conditions or natural calamities, the officer empowered by the Government in this behalf *may*, on receipt of an application .."

My amendment is For the word 'may' in the above, substitute the word 'shall'

మిస్టర్ స్పీకర్ సభ్యులు 'షల్' గురించి మాట్లాడ నక్కరలేదు. ఎందుకంటే తక్కిన అన్ని అమెండ్‌మెంట్సులో 'షల్' 'షల్' అని ఉన్నది కాబట్టి సభ్యులు అసలువిషయంమీద మాట్లాడండి.

శ్రీ యమ్. సత్యనారాయణరాజు అయితే నేను మాట్లాడవలసింది ఏమీ లేదు

*శ్రీ వి విశ్వేశ్వరరావు : అధ్యక్షా, ఎంత పంట చెడిపోతే ఎంత రెమిషన్ ఇస్తారో, యీ బిల్లులో పెట్టవలసిందిగా మేము అంటే "జనరల్ రెమిషన్

రూల్సు ఒకటేనని, దీనికి ప్రత్యేకంగా రూల్సు చేయవలసిన అవసరం లేదని'' మంత్రిగారు చెప్పారు పోనీ, దానిని మీరు అంగీకరించకపోతే అంగీకరించక పోయారు కనీసం, ధరలవిషయమైనా, ప్రభుత్వం దృష్టిలో పెట్టుకొని రైతుల మీద పన్ను వేయవలసి ఉంటుంది మూడు, నాలుగు సంవత్సరాలలో ఉన్నటువంటి యావరేజి ధరకన్నా కూడ ఇప్పుడు ధరలు తగ్గినపుడు, రెమిషన్ ఇవ్వాలనేది ప్రభుత్వం తీవ్రంగా ఆలోచించాలి ఇదివరకు 350 రు అమ్మిన పసుపుధర యీనాడు 80 రు లు ఉన్నది పూర్వం ఉన్న ధరలో ఇప్పటి ధర నాలుగవవంతుకూడ లేదు అటువంటి పరిస్థితిలో, ఆ పంటమీద ఎకరానికి ఐదు రూపాయలు వసూలు చేస్తామనటం ఏ విధంగాను న్యాయమైనది కాదని చెబుతున్నాను గత సంవత్సరంలో ఉన్న ధరతో పోల్చి చూస్తే, ఇవాళ పొగాకుధర విపరీతంగా పడిపోయింది ప్రభుత్వం వాటిధరలను అదుపులో పెట్టే స్థితిలో లేకుండా ఉన్నది "ధరల విషయం మాకు అవసరంలేదు, మీరు పైరు వేశారు కాబట్టి, పంటలు పండినా, ఎండినా, ధరవచ్చినా, రాకపోయినా, మీరు ఎన్ని కష్టాలైనాపడి, అప్పులైనా తెచ్చి, మాకు పన్ను కట్టండి" అని ప్రభుత్వం చెప్పటం న్యాయమైనది కాదని చెబుతున్నాను యావరేజిధర తగ్గినపుడు ప్రభుత్వం రైతులకు రెమిషన్ ఇవ్వాల్సి ఉంటుంది వాటి విషయం ఇప్పుడు ఆలోచించకుండా, ఎప్పుడో తర్వాత చూస్తామని అనటం ఏమాత్రం న్యాయంగా ఉండదు కాబట్టి యావరేజి ధరకన్నా, ధరలు తగ్గినపుడు, ఎంతో కొంత పర్సంటేజి పన్ను తగ్గించి రెమిషన్ ఇస్తామని, యీ బిల్లులోనే స్పష్టంగా చెప్పవలసిన అవసరము ఉన్నది ఆ విధంగా చెప్పకపోతే అనవసరంగా రైతును కష్టపెట్టి నట్లు అవుతుంది, అని మంత్రిగారిదృష్టికి మీ ద్వారా తీసుకువస్తున్నాను

*శ్రీ టి వి. రాఘవులు (కొవ్వూరు-రిజర్వుడు) అధ్యక్షా, ఇప్పుడు ప్రతిపక్షంవారు తెచ్చిన సవరణను వ్యతిరేకిస్తూ నేను మాట్లాడుతున్నాను. వారికి మొట్టమొదట ఒకటి రెండు విషయాలు సుస్పష్టంగా చెప్పాలి. ఒకటి—రెమిషన్‌కు సంబంధించినంతవరకు ఇది ఇండివిడ్యుయల్ మేటర్ ఆఫ్ రైట్‌గా క్లయిమ్‌చేసే విషయం కాదు ఇది డిస్క్రిషనరీ పవర్‌గా గవర్నమెంటులో వెస్ట్ అయి ఉంది జనరల్ కెలామిటీ వచ్చినపుడు, ప్రకృతి వైపరీత్యంవల్ల, మానవునికి అందుబాటులో లేని శక్తులు అతనితో సహకరించక పోవడంవల్ల ఏదైనా మహా విపత్తు వచ్చినట్లయితే, అప్పుడు రైతులకు సహాయం చేసి, రెమిషన్ ఇచ్చే రైటు ఇదివరకే గవర్నమెంటుకు ఉన్నది. ఇప్పుడు పంటలు పండే విషయంలోనే కాదు ధరలుతగ్గి, ఆర్థికమాంద్యం ఏర్పడినపుడు వచ్చే ఒడుదుడుకులను రైతాంగం ఎదుర్కోవలసి వచ్చినపుడు, వారికి ఏదైనా సహా

యము చేయవలసి ఉంటుందని సభ్యులు చెబుతున్నారు ఆర్థిక మాంద్యంవల్ల ఏర్పడిన సమస్యను ఎదుర్కోటానికి రైతుకు పన్నులో కొంతభాగం తగ్గించి నంత మాత్రాన చాలదు అటువంటి పరిస్థితులు ఏర్పడినపుడు, లాంగ్ రేంజ్ ప్లానులో పంటలకు సరైన మార్కెట్ ఏర్పాటుచేయటం, రైతులకు సహకార పరపతి సౌకర్యాలు కలిగించటం, క్రాప్ ఇన్సూరెన్సు ఏర్పాటు చేయటం చాలా అవసరము ఇంకా, ఆర్థిక మాంద్యం చేయిజారిపోయిందంటే, మారిటోరియమ్ డిక్లేర్ చేయటం మొదలైనటువంటి అనేక విధాలైన సహాయాలు, సహకారాలు చేయటానికి ప్రభుత్వము ఆలోచన చేయాలి అంతేగాని "మనం కేవలం యీ చిన్న టాక్సేషన్ మేజర్‌లో ఎమెండ్‌మెంటు ద్వారా ఇంతపని సాధించాలి" అంటే వీలుకాదు "ధరలు పడిపోతే గవర్నమెంటు పన్ను తగ్గిస్తారా ?" అని అడుగుతున్నారు, ధరలు హెచ్చితే మనం పన్నులు హెచ్చిస్తామా అని వారిని ప్రశ్నిస్తున్నాను కొంతకాలంవరకు (20 ఏళ్ళనో, 30 ఏళ్ళనో) సెటిల్‌మెంట్ అన్నది ఉంటుంది. అంతేగాని, కేవలం ధరవరల హెచ్చు తగ్గులుబట్టి పన్నుల వ్యవహారం జరగాలి అనటం న్యాయంకాదని తెలియజేస్తూ, ఇటువంటి సవరణ అవసరంలేదని మనవిచేస్తూ, విరమిస్తున్నాను

శ్రీ పి సుందరయ్య (గన్నవరం) అధ్యక్షా, రాఘవులుగారు మాట్లాడిన తర్వాత "more loyal than the king himself" అనే రకంగా నాకు కనపించింది. అంటే, రాజుకన్నా, రాజభక్తి ఎక్కువగా ఉన్నట్లు కనుపిస్తోంది అంటే మంత్రిగారికన్నా, ఎక్కువ పట్టుదల చూపించటము, వారి సభ్యులకు ఉన్నదన్న సంగతి తెలుస్తున్నది

శ్రీ టి వి. రాఘవులు · సభ్యులకు మంత్రిగారిపైన భక్తితాత్పర్యాలు తక్కువగా ఉండాలని ఎక్కడా నిర్దేశించబడలేదు.

* శ్రీ పి సుందరయ్య ఎక్కువ ఉండనవసరం లేదనేది నా పాయింట్. కాని, తక్కువ ఉండాలని నేను అనటంలేదు. కమర్షియల్ క్రాప్స్‌మీద పన్ను వేసేటప్పుడు మనము ఒక విషయం ఆలోచించాలి. కమర్షియల్ క్రాప్స్‌కు ఒకసారి ఎక్కువ ధర వస్తూంటుంది. అప్పుడు ఎక్కువ లాభాలు వస్తూంటాయి. ఆహార పంటలకన్నా, యీ కమర్షియల్ క్రాప్స్‌కు ఎక్కువ ధరలు ఉంటాయి కనుక ఎక్కువ ఆదాయం రావటానికి అవకాశం ఉన్నది, రైతులు తమకు ఎక్కువ గిట్టుబాటు అవుతుందన్న ఉద్దేశంతో కమర్షియల్ క్రాప్స్ వేయటం జరుగుతుంది, కాని యీ కమర్షియల్ క్రాప్స్ ధరలు చాలా ఒడుదుడుకులతో

కూడి ఉంటాయి వీరికి ఒక సంవత్సరం బాగా లాభాలు రావచ్చును మరొక సంవత్సరం పూర్తిగ పంటలు పోయే పరిస్థితి ఏర్పడవచ్చును "కమర్షియల్ క్రాప్స్ మీద లాభాలు సంపాదిస్తున్నారు కాబట్టి, పన్ను వేయాలి" అన్న దృక్పథం సరైందికాదు ఐదు సంవత్సరాల ముందునుంచి ఉన్నటువంటి సగటు ధరలో నూటికి 25 పాళ్లు ధరలు తగ్గితే, రైతులు దివాళాతీసే పరిస్థితి ఏర్పడుతుంది వారు పెట్టిన ఖర్చులు కూడ గిట్టుబాటు కాని పరిస్థితి ఏర్పడుతుంది గనుక వారికి అటువంటి పరిస్థితుల్లో రెమిషన్ ఇవ్వాలని కోరుతున్నాను నూటికి 5 పాళ్ళు, 10 పాళ్ళు ధరలు తగ్గితే రెమిషన్ ఇవ్వమని మేము చెప్పటములేదు "రెమిషన్ ఇవ్వటానికి మాకు అధికారం ఉంది రైతులకు నష్టం వస్తుంటే మాకు తెలియదా ? వారికి రెమిషన్ ఇవ్వటానికి మేము ప్రయత్నించమా ? ధరలు పడిపోతే రెమిషన్ ఇవ్వడానికే, యీ అధికారం మేము తీసుకొంటున్నాము" అని ప్రభుత్వం చెబుతున్నది ఆవిధంగా చూసినపుడు, నూటికి 75 పాళ్ళు పంట పోతే రెమిషన్ ఇవ్వాలని ప్రభుత్వం అనుకోవచ్చును లేదా, సగానికి సగం ధర పడిపోతేగాని రెమిషన్ ఇవ్వకూడదనే ధోరణిలో ఆలోచించవచ్చును ధరలు పడిపోయినపుడు రెమిషన్ ఇచ్చే అధికారం గవర్నమెంటుకు ఇస్తున్నప్పుడు, "నూటికి 25 పాళ్ళు ధరలు పడిపోతే రెమిషన్ ఇచ్చితీరాలి" అని ఖచ్చితంగా శాసనంలో పెట్టాలి అది గవర్నమెంటుకు గయిడెన్స్‌గా కూడ ఉంటుంది ఐదు సంవత్సరాలలో ఉండే సగటు ధరకన్నా, 25 పర్సెంట్ ధరలు పడిపోతే, రైతు దివాళా తీసే పరిస్థితి ఏర్పడుతుంది కనుక, కమర్షియల్ క్రాప్స్ ధరలయొక్క ఒడిదుడుకులనుబట్టి ఆధారపడి ఉంటాయి కనుక, యీ సవరణను ప్రభుత్వం తప్పకుండా అంగీకరించవలసి ఉన్నది ఇది చాలా న్యాయమైన సవరణ దానిని అంగీకరించమని సెలక్ట్ కమిటీలోకూడ ఒత్తిడి చేశాము కాని అక్కడ మంత్రిగారు అంగీకరించలేదు ఇది చాలా ముఖ్యమైన సవరణ కాబట్టి, యీ లోపల మంత్రిగారు దీనిని గురించి ఆలోచించుకొని ఉంటే, యీ సవరణను తప్పకుండా అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ధరలలో ఒడుదుడుకులు కూడ ఉంటవి కనుకనే ప్రభుత్వమువారు తెచ్చిన ఏ శాసనములోను కూడ లేనటువంటి క్లాజును ఈ బిల్లులో చేర్చడము తటస్థించింది. ధరవరలు తగ్గినవి అనే భావము కలగడముచేత కూడ—ఒకరికి, ఇద్దరికి కాదు—రాష్ట్రము మొత్తముమీద remission యిచ్చే అధికారము ఈ క్లాజు ద్వారా రాష్ట్రప్రభుత్వము తీసుకోవడము జరిగింది ప్రభుత్వానికి wide powers ఇవ్వవలెనా, లేదా అనే విషయములో ఒకరు 'more loyal than the King' అని, ఇంకొకరు 'No confidence

in the Government' అని అభిప్రాయము వెలిబుచ్చారు అందువల్ల యీ సవరణలను నేను అంగీకరించటానికి వీలులేదు

*Mr Speaker* The question is

"For the existing sub-clause (2) of clause 4, substitute the following —

'(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy-five per cent of the average price prevailing during 1950-55 '

The motion was negatived

*Sri B Sankarayya* I demand a division, Sir

The House then divided

Ayes 36 Noes 85

The motion was negatived

*Mr Speaker* The question is

"For the existing sub-clause (2) of clause 4, substitute the following

(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy-five per cent of the average price prevailing during the previous five years."

The motion was negatived

*Mr Speaker* The question is

"For the existing sub-clause (2) of clause 4, substitute the following —

(2) The Government shall remit in whole the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to seventy-five per cent of the average price prevailing during the previous three years."

The motion was negatived

*Mr Speaker* The question is

"For the existing sub-clause (2) of clause 4, substitute the following

'The Government shall remit half the special assessment payable under this Act in respect of any crop in any area or areas if the price falls to the average price prevailing during the last five years' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In line 1 of sub-clause (2) of clause 4, for the word 'may' substitute the word 'shall' "

The motion was negatived

*Mr Speaker* The question is

"In line 3 of sub clause (2) of clause 4, after the words 'in any area or areas' insert the words 'where the price level in respect of any crop specified in the schedule falls by 25% of the average price obtaining during the previous three years or any other sufficient cause' "

The motion was negatived

*Mr Speaker* The question is

"That Clause 4 stand part of the Bill"

The motion was adopted

Clause 4 was added to the Bill

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా, ఈ బిల్లులోని 5 వ క్లాజును delete చేయాలని కోరుతున్నాను ఇందులో "Power to amend schedule" అని ఉన్నది దీనిని చదువుతున్నాను

"The Government may from time to time by notification in the Andhra Pradesh Gazette add to amend or cancel any of the entries in the Schedule, and such notification shall specify, the year from which it shall take effect" అని ఉన్నది దీనితోపాటు ఇంకొక proviso కూడావున్నది. "provided that no such notification shall be made

unless a draft thereof has been approved by the Legislative Assembly" అని ఉన్నది

Legislative Assembly ఎటూ ఒప్పుకోవాలని ఒప్పుకున్న తరువాతనే అమలుకు వస్తుందని చెబుతూన్నప్పుడు, ఈ లోపల ప్రభుత్వము notify చేస్తే దానియొక్క ఉపయోగము మాత్రము ఏమి ఉంటుంది ? అందువల్ల శాసన సభకు ఉన్న అధికారము యథాతథంగా ఉన్నది ఈ క్లాజువల్ల ప్రభుత్వము సంపాదిస్తున్న హక్కు ఏమీలేదు అసెంబ్లీ ఆమోదంతో schedule లో అవసర మైన మార్పులు చేసుకోవచ్చు అందువల్ల యీ క్లాజు అనవసరము గనుక, దీనిని delete చేయాలని అంటున్నాను

శ్రీ కె యల్ నరసింహారావు (ఇల్లెందు) అధ్యక్షా, ఈ క్లాజు Constitution కే విరుద్ధముగ ఉన్నదని నా అభిప్రాయము ఎందుకంటే యీ section యొక్క drafting యీ విధముగ ఉన్నది

"The Government may from time to time by notification in the Andhra Pradesh Gazette add to amend or cancel etc" అని ఉన్నది ఇందులో కొన్ని పైర్లపేర్లు ఉన్నవి. వీటికి కొన్ని పన్నులు నిర్ణీతమైన పద్ధతులలో ఇక్కడ నిర్ణయించి యున్నవి అయితే ఇంకొక పంటను ఎప్పుడైన "add" చేయడమంటే, ఒక క్రొత్త పంటమీద పన్ను వేయటానికి ప్రభుత్వానికి యీ రోజున అధికారము ఇస్తున్నామన్నమాట. అట్లాగే amend అని అన్న ప్పుడు మనము దానిని తగ్గించడానికి amend చేయవచ్చు పెంచటానికి amend చేయవచ్చు కాని దానిని పెంచడానికే ప్రభుత్వము amend చేయదలచు కుంటే, అది గవర్నరుగారి పర్మిషను లేకుండా చేయటానికి ప్రభుత్వానికి యీ రోజుననే chance యివ్వటానికి మనకు వీలులేదన్నమాట ఎందుకంటే గవర్నరుగారి పర్మిషను లేకుండా ఏ క్రొత్త వస్తువుమీద పన్ను వేయడానికిగాని, లేకపోతే యీ రోజున విధించబడే పన్నును పెంచే అధికారము ప్రభుత్వానికి యివ్వటానికిగాని ఈ ఎసెంబ్లీకి అధికారము ఉన్నదని నేను అనుకోవడము లేదు. అందువల్ల ఈ క్లాజు Constitution కు విరుద్ధముగ ఉన్నదని అభిప్రాయ పడుతున్నాను

మిస్టర్ స్పీకర్ ఈ బిల్లు కంతటికీ గవర్నరుగారి assent వచ్చిందిగనుక, ప్రత్యేకంగా ఒక క్లాజుకు రాలేదు గనుక ఇది "Constitutional and Intra-vires" అని నేను రూలింగు ఇస్తున్నాను

శ్రీ కె యల్ నరసింహారావు ఇప్పుడు ఈ బిల్లు అంతటికి గవర్నరు గారి assent వచ్చిందని చెబుతున్నారు అయితే Blank cheque సంతకము చేసే అధికారము గవర్నరుగారికి ఉన్నదా, లేదా అనే సమస్య వేరుగా ఉన్నది దానినిగురించి వేరే స్థలములో మనము ఆలోచించుకోవచ్చు ననుకోండి

మిస్టర్ స్పీకర్ వేరేస్థలము సంగతి మన కెందుకు ఇక్కడ ? ఈసంగతిని గురించి చెప్పండి ఇప్పుడు

శ్రీ కె యల్ నరసింహారావు ఆ సంగతినికూడ మీ ముందుకు తీసుకుని రావడము అవసరమని అనుకుని చెబుతున్నాను ఎందువల్లనంటే, మీరు ఈ విషయమును దృష్టిలో పెట్టుకుని Constitution కు లోబడి Constitution ను పరిశీలించి దానిని accept చేయడమూ, చేయకపోవడమూ అనే దానినికూడ పరిశీలించవలసిన అవసరము ఉన్నది అయితే ఇప్పుడు మీరు రూలింగు ఇచ్చారు గనుక దానిని గురించిన ఆలోచన ఏమీలేదు

మిస్టర్ స్పీకర్ అక్కరలేదు

శ్రీ కె యల్ నరసింహారావు అయితే ఒక్క విషయము మాత్రము ఉన్నది ఇది మరొక ప్రక్కన ఎసెంబ్లీయొక్క అధికారమును కుంచింపజేస్తున్నది ఈ చట్టములోపల ఏదైన సవరణ చేయాలనుకుంటే, దానిని బిల్లు స్వరూపములో ఎసెంబ్లీ ముందుకు తీసుకునివచ్చి దానిని గెలిపించుకుని పన్నులు విధించడమంటే న్యాయముగ ఉంటుంది అట్లా చేయకుండా, ఒక క్లాజును ఇందులోపెట్టి, ఆ క్లాజుద్వారా మొత్తము అధికారమంతయు ప్రభుత్వము చేతులో పెట్టుకుని ఇదివరకు ఎట్లాగైతే రూల్సు విషయములో ఈ House లో Table మీద పెట్టి, దానికి ఉండే గడువు 14 రోజులో, 15 రోజులో అయిపోగానే అది ప్యాసు అయిపోయినట్లుగా పరిగణించబడే అలవాటు ఉన్నదో అదేమాదిరిగ చేస్తే ప్రమాదము ఉండేటట్లుగా ఉన్నది ఇక్కడ "Provided that no such notification shall be made unless the draft thereof has been approved by the Legislative Assembly" అని ఉన్నప్పటికినీ మన ఎస్సెంబ్లీ రూల్సులో ఉన్న ఏ రూల్సును అనుసరించి ఈ సభముందుకు వస్తుందో నా కేమీ అర్థము కావడములేదు. అయితే ఒకవేళ అసెంబ్లీ రూలు నెం 247 ను అనుసరించి అది సభముందుకు వచ్చేటట్లయితే, ప్రభుత్వము ఆ విషయమును, ఒక motion రూపములో

move చేయవలసిన అవసరము లేదు 247 వ రూలులో స్పష్టముగా వున్నది "Whereas a Regulation, Rule, Sub-Rule, Bye-law etc framed in pursuance of the Constitution or of the Legislative functions delegated by the Legislature to a subordinate authority is laid before the Assembly, the Minister shall make mention of it on the floor of the Assemby and the period specified in the Constitution or the relevant Act for which it is required to be laid shall be completed before the Assembly is adjourned Sine die and later prorogued unless otherwise provided for in the Constitution or the relevant Act" అంటే మంత్రిగారు దీనికి సంబంధించిన ఒక draft ను తీసుకునివచ్చి ఈ అసెంబ్లీ ముందర పడవేశారు ఆ 14 రోజులో, 15 రోజులో Constitution ను అనుసరించి ఉన్నగడువు కాస్త అయిపోగానే అది ప్యాసు అయిపోయినట్లుగాను, ఈ అసెంబ్లీ పనులు అయిపోయినట్లుగాను పరిగణించబడే ప్రమాదము ఉన్నది అందువలన ఈ క్లాజు ఇందులో ఉండడము అనవసరము అవుతుంది దీన్ని మరల ఒక బిల్లు స్వరూపములో తీసుకుని వచ్చి పన్నులు పెంచాలని అంటే, పెంచే అధికారము ప్రభుత్వానికి ఉన్నది. అందువల్ల దీనిని delete చేయాలని కోరుతూ, మంత్రిగారు దీనిని accept చేస్తారని ఆశిస్తున్నాను

శ్రీ కె వెంకటరావు దీనిని నేను అంగీకరించడములేదండి ఇలాంటి similar section ను మొన్ననే ప్యాసుచేసిన Sales Tax Act లో ఒప్పుకున్నారు "The Government have power to make Rules" అని అంటే, powers absolute గా ఉండేవి ఇప్పుడు అది మార్చి మరల Legislative Assembly ముందుకు తీసుకునివచ్చి, ఇక్కడ దానికి approval పొందే పద్ధతిలోకి develop అయింది. దానిని మనమేకాదు, world అంతాకూడా follow అవుతున్నారు This is nothing extraordinary ఇది England లో ఉన్నది India లో అన్ని provinces లో ఉన్నది Central Government లో ఉన్నది

శ్రీ కె యల్. నరసింహారావు అట్లా ఉన్నదని దీనిని motion రూపములో తీసుకునివచ్చి ప్యాసు చేయించదలచుకున్నారాండి ?

* శ్రీ కె. వెంకటరావు అందులో ఉన్న రూలుప్రకారము అని అంటున్నాను. దానిని తప్పించి ప్రత్యేకంగా దేనివిషయములోనూ కూడ శాసనసభ ముందుకు రాదు ఇష్టములేకపోతే ఈలాంటి procedure ను obstruct చేసి, దీనిని defeat చేయాలిగాని, వేరే ఏమీ లేదు అసలు దీనికి ఒకరకమైన procedure అంటూఉంటే, అది కాదని, ఇక ప్రతిదానికి ఒక క్రొత్తపద్ధతి రాదు అవతల

Assembly Rules అనేవి ఉన్నవి ఇవతల వాటికి సంబంధించిన power పెట్టుకో బడింది అవి తీసుకునివచ్చి సభలో మీ ముందర పెట్టుతాము వాటికి motion పెట్టుకునే అధికారము ఉంటే ప్రభుత్వము motion తెచ్చుకుని మరల దానికి General చర్చ అని ఒకటి, point of orderఅని ఒకటి, చివరకు 3rd Reading అని ఒకటి, ఈ విధముగ ఉంటే, administer చేయడము కష్టము గనుక ప్రభుత్వమునకు ఉన్న absolute అధికారముతోటి తన ఇష్టము వచ్చినట్లుగా, అయిదురూపాయలను ఆరురూపాయలుగాగాని, లేకపోతే అయిదునుమూడుగా గాని చేసేటటువంటిది లేకుండా, దానిని control చేయటానికే ఇక్కడ Assembly లో పెట్టటానికి ఒక provision పూర్తిగ ఉన్నది అది వచ్చినప్పుడు సభ్యులు alert గా ఉండి హక్కు exercise చేసుకుంటే ఏలాంటి అభ్యంతరము ఉండదు కనుక ఈ సవరణ అవసరము లేదని మనవి చేస్తున్నాను

*Mr Speaker* Now, amendments 49 to 52 may be moved

*Sri G Yellamanda Reddi* I beg to move

"In line 3 of sub-clause (1) of clause 5, delete the words 'add to' "

*Mr Speaker* Motion moved

*Sri B Sreeramamurthy* I beg to move

"In line 3 of sub-clause (1) of clause 5, delete the word 'add to, amend or' "

*Mr Speaker* Motion moved,

*Sri M Nagi Reddi (Macherla)* I beg to move

"In line 3 of sub-clause (1) of clause 5, for the words 'add to, amend', substitute the word 'decrease'

*Mr Speaker*. Motion moved

*Sri K L Narasimha Rao* I beg to move

"In line 3 of sub-clause (1) of clause 5, for the words 'add to, amend' substitute the words 'amend to reduce the rate of special assess-ment' "

*Mr Speaker* Motion moved

శ్రీ బి. శ్రీరామమూర్తి అధ్యక్షా, ఈ బిల్లును గురించి చాలావరకు చర్చ జరిగింది ఇందులో ప్రభుత్వము ఒక క్లాజును చేర్చింది బిల్లుయొక్క షెడ్యూలును amend చేయటానికి, add చేయటానికి ఈ క్లాజు ద్వారా ప్రభుత్వము అధికారము తీసుకుంటున్నది ఈ అధికారము తీసుకోటానికి ఒక కారణము నాకు కనబడుతున్న బిల్లులోని మూడవ క్లాజుక్రింద రెండవ explanation ను చూస్తే ఏ భూమిలోనయినా రెండు పంటలకంటే మించి ఇంకొక పంట వేసేటట్లయితే, అప్పుడు ఏ రేటుమీద, ఏ పద్ధతిని అనుసరించి పన్నులు విధించడమవుతుందో అందులో స్పష్టము చేయబడ్డది ఎందువలన ఆ విధముగ చేయవలసి వచ్చింది? రెండుపంటలకు మించి వేసినప్పుడు, ప్రస్తుతము ఉన్న షెడ్యూలునుబట్టి రెండుపంటలకు మాత్రమే కలిపి పన్ను వేయటానికి అవకాశమున్నది దానికి మించి పంట మరొకటి వేయటానికి అవకాశము ఇందులో లేనేలేదు ఒక వేళ వేసినా, అది ఎక్కడో అరుదుగా జరుగుతూ ఉంటుంది కాని, ఎల్లప్పుడు ఉండదు ముఖ్యంగా మాజిల్లాలలో అది మాత్రము జరగదు సాధారణముగ ప్రత్తి, వేరుశనగ ఈ రెండుపంటలే కలిపి వేస్తూఉంటారు దానికి మించి మూడవపంట వేయడము జరగదు అయినప్పటికినీ "Two or more crops" అని ఎందువలన మార్చారనిఅంటే, ఇంకొక కొత్తపంటను అందులో include చేయాలనే అభిప్రాయముతోనే ప్రభుత్వము యీ షెడ్యూలును మార్చుతున్నది. అయితే అలాంటి అభిప్రాయము కనుక ప్రభుత్వానికి ఉంటే, శాసనసభ ఎదుటకు తీసుకునివచ్చి ముందుగా సభ్యులకు తెలియజేసి ఎందువలన ఆమోదము పొందకూడదు? సభ్యుల నెత్తిన పెట్టి బేరమాడడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తున్నది ప్రభుత్వము ఉద్దేశ్యము ఏమిటో సభ్యులకు తెలియదు సభ్యులకు ముందుగా తెలియజేయకుండానే సభ ఎదుట పెట్టి ఆమోదముద్ర పొందాలని ప్రయత్నము చేస్తున్నది ఇది సరియైన పద్ధతికాదు. ఏమైనప్పటికినీ, ఏదయినా కొత్తగా ఒక పైరు పేరును షెడ్యూలులో ప్రభుత్వము చేర్చాలని ఉద్దేశించినట్లయితే, ఇంతవరకు దానిని చేర్చకుండ ఎందుకు విడిచిపెట్టిందో, ఇప్పుడు ఎందువలన చేర్చాలని ప్రభుత్వము అభిప్రాయపడిందో చెప్పవలసియుంటుంది అందువలన "amend" అనే పదము చేర్చడమువలన రెంటికంటె ఎక్కువపంటలను తప్పనిసరిగ షెడ్యూలులో చేర్చటానికి సభ్యులకు ముందుగా చెప్పకుండా, ప్రయత్నము చేస్తున్నదని స్పష్టమైపోయింది దీనివలన జరిగే ఫలితము ఏమిటంటే, శాసనసభయొక్క ఆమోదము పొందినట్లుగా భావించేటట్లు చేసి, హెచ్చుపన్ను రైతాంగము నెత్తినవేసి వసూలు చేయటానికి అవకాశము

ఉంటున్నదిగనుక, ఈ "amend" అనే పదమును తప్పనిసరిగ delete చేయాలని అంటున్నాను దీనిని మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను

*శ్రీ కె యల్ నరసింహారావు అధ్యక్షా, ఈ బిల్లులోని అయిదవ నెంబరుగల క్లాజును delete చేయటానికి మంత్రిగారు ఒప్పుకోవశము లేదు నా సవరణను మంత్రిగారు accept చేస్తారని ఆశించాను ఒకవేళ వారు accept చేయకపోతే, దానివల్ల ప్రమాదము మాత్రము రాబోతున్నదని, ఈ విషయము సభ్యులందరికి తెలియజేయడము అవసరమని నేను అభిప్రాయపడి మీ ద్వారా సభవారికి తెలియజేస్తున్నాను కారణమేమిటంటే ఇప్పుడు మనము కొన్ని బిల్సును ప్యాసు చేశాము ఈ సెషన్‌లో ప్యాసు అయిన బిల్లులు అన్నీ టాక్సేషన్ బిల్లులే ప్రభుత్వము యింతవరకు ఏవైనా బిల్లులు ప్యాసు చేయాలని అనుకుంటే, దానికి శాసనసభలో చర్చింపజేసి ప్యాసు చేయించుకోవడమనే పద్ధతి ఉండేది. ప్రజలమీద ఏ పన్నులు వేయదలచుకున్నప్పటికినీ, దానిని ఒకబిల్లు రూపములో సభ ఎదుటకు తీసుకునివచ్చి ప్యాసు చేయించవలసి యున్నది అది చట్టము అయిన తరువాతగూడ ఏదైనా మార్పు చేయాలన్నా, మరల దానికి ఒక Amending Bill తెచ్చి సభద్వారా ప్యాసు చేయించుకోవలసిందే ప్రతి సవరణను సభ్యులకు తెలియజేసి, ఆమోదించమని కోరే ఆచారము పెట్టుకున్నాము కాని ఇప్పుడు ఆ ఆచారము తప్పించటానికి ప్రభుత్వము శాసనసభకు ఉన్న హక్కులు అన్నీ తొలగించి, ప్రభుత్వమే ఆ హక్కులను హస్తగతము చేసుకొని, శాసనసభతో నిమిత్తము లేకుండా వ్యవహరించటానికి ఒక క్లాజును గవర్నరుగారి assent ద్వారా ప్రయత్నము చేస్తున్నది ఇప్పుడు యీ పద్ధతి allow చేసేటట్లు అయితే, ఇక ప్రతిదీగూడ శాసనసభతో నిమిత్తము లేకుండా ప్రభుత్వమే అన్నిపనులు చేసుకోవచ్చు అదేవిధముగ మన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన చట్టములు ఇప్పటివరకు ప్యాసు అయినవి, ఒక Gazette notification ద్వారా సవరించటానికి వీలుంటుంది ఇప్పుడు ఈ విధానమును allow చేస్తే, ప్రతి సవరణను గూడ సవరించే అధికారము ప్రభుత్వమే చేయటానికి వీలుగ మనము ప్రభుత్వానికి అప్పగిస్తున్నామన్నమాట ఇది చాలా ప్రమాదకరమైన పద్ధతి గనుక దీనిని allow చేయకూడదని సభ్యులందరికీ హెచ్చరిక చేస్తున్నాను ప్రభుత్వము ఏ పని చేసినా, శాసనసభకు తెలియకుండానే జరుపుకునిపోయే పరిస్థితి ఏర్పడుతున్నది ఇకముందు ఏ బిల్లుకూడ శాసనసభ ఎదుటకు రాకుండాపోయే ప్రమాదము ఉన్నది అందువల్ల యీ విషయము సభ్యులందరు చాలా తీవ్రంగా ఆలోచించవలసి ఉన్నది ఇలాంటి పద్ధతిని మనము ప్రతిఘటించవలసి

ఉంటుంది ప్రస్తుతము ఈ బిల్లుకూడ Taxation Bill యే ఈ బిల్లులో పదిరకాల పంటల పేర్లు షెడ్యూలులో వ్రాసియున్నవి ఇప్పుడు ఈ పదింటికి, ఇంకా కొన్ని చేర్చటానికి ప్రభుత్వము పన్ను విధించటానికి అవకాశము ఉండేటట్లు కోరుతున్నది దానికి అధికారము ప్రభుత్వం ఈ క్లాజు రూపములో తీసుకుంటున్నది ప్రభుత్వం ఏపన్నులు విధించాలన్నా, పెంచాలన్నా, అది ఒక బిల్లుద్వారా శాసనసభముందుకు తెచ్చి ప్యాసు చేయించుకోవడము న్యాయముగ ఉంటుందే గాని, శాసనసభకు ఉన్న హక్కులను అతిక్రమించి, ఇలాంటి క్లాజును చేర్చడం దాని ద్వారా పన్నులు పెంచడమనే పద్ధతి నాకు తెలిసినంతమటుకు ఎప్పుడు చూడలేదు ఒక ఉదాహరణ చెపుతున్నాను ఇదివరకు Tenancy Act వచ్చింది అప్పుడుకూడ పన్నులు పెంచేవిషయములో మాత్రము ఇలాంటిది ఒక క్లాజును తీసుకునిరావడము, తద్వారా పన్నులు పెంచడము నేను ఎన్నడును చూడలేదు ఇప్పుడు ఈ విధముగా చేయడమువల్ల అధికారము అంతయు ప్రభుత్వము తన చేతిలోనికి తీసుకుంటున్నప్పుడు, అది మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునే ప్రమాద స్థితిలోనికి తీసుకురావడమే అవుతున్నది ఈ విధముగచేస్తే, మనము యీ సభకు ఉన్నహక్కు వదులుకుని ప్రభుత్వము చేతిలోనే అధికారమును ఒప్పచెప్పుతున్నామన్నమాట అందువల్ల యీలాంటి క్లాజు ఉండకుండావుంటేనే బాగా ఉండేది అయినప్పటికినీ ఇప్పుడు అధ్యక్షులవారు రూలింగు కూడ ఇచ్చారు ఈ క్లాజును withdraw చేసుకోమని మంత్రిగారిని కోరితే వారు accept చేయలేదు అందువల్ల పన్ను పెంచటానికి ప్రభుత్వము అధికారము కోరుతున్నదన్నమాట ? కాబట్టి "add" "to amend" అనే పదములకు బదులు "Amend to reduce the rate of special assessment" అని చేర్చి, అంతవరకే ప్రభుత్వానికి అధికారము ఇస్తే సరిపోతుందని అనుకుంటాను ఎందుకంటే పన్ను పెంచటానికే గవర్నరుగారి పర్మిషను కావాలిగాని, తగ్గించటానికి అవసరమే లేదు ఇప్పుడు యీ పన్ను పెంచేవిషయములో గవర్నరుగారి పర్మిషను యివ్వడానికి నాకు ఒక ప్రత్యేకమైన అభ్యంతరము కలదు Speaker గారు ఎటూ రూలింగు యిచ్చివేశారు. దానికి లోబడి మనము పన్ను పెంచటానికి ప్రభుత్వమునకు అధికారము ఇవ్వడము న్యాయము అనిపించుకోదు అందువల్ల రాష్ట్ర పరిస్థితులనుబట్టి ప్రభుత్వము అవసరమని అనుకుంటే రేట్లు నిర్ణయించటానికి మాత్రమే ప్రభుత్వానికి అధికారము ఇస్తూ, యీ బిల్లును ప్యాసుచేస్తే చాలును అని నా అభిప్రాయము. ఈ విషయము మంత్రిగారు ఆలోచిస్తారని, సభ్యులుకూడ ఒక నిర్ణయానికి వస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను

శ్రీ కె వెంకటరావు ఇది మరల fundamental discussion లోకి పోయేటట్లుగా ఉన్నది దీనినిగురించి ప్రభుత్వానికి ఒక స్పష్టమైన అభిప్రాయం ఉన్నది ప్రపంచములో సాంప్రదాయములు కూడ ఉన్నవి

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, మంత్రిగారు చాలా పొరబాటుపడి సమాధానాలు చెబుతున్నారు కాని, ఇందులో శాసనసభముందర రూల్సు ఉండగా, యీ విషయములో శాసనసభకు హక్కులేదు అనే విధముగ ఇందాక మంత్రిగారు చెప్పిన సమాధానమును బట్టి తెలుస్తున్నది అలాగైతే చాలా చిక్కు వస్తున్నది ఈ క్లాజుక్రింద యిప్పుడు ఉన్న provision ఏమిటంటే—"Provided that no such notification shall be made unless a draft thereof has been approved by the Legislative Assembly" అని ఇప్పుడు ప్రభుత్వము పన్ను తగ్గించాలన్నా, పెంచాలన్నా, తీసివేయాలన్నా, ఏమి చేయాలన్నా Rule making power క్రింద ప్రభుత్వము చేసేది సరిఅయినదని పరిగణించటానికి వీలులేదు ఇక్కడ ప్రభుత్వము draft ను తీసుకొనివచ్చి ఎసెంబ్లీముందు పెట్టి, ఎసెంబ్లీయొక్క ఆమోదము పొందినతరువాతనే ప్రభుత్వం ఏమైనా చేయగలదే కాని, అంతవరకు ప్రభుత్వం ఏమిచేయటానికి వీలులేదు ఎసెంబ్లీయొక్క ఆమోదములేకుండా గజెట్ లో ప్రకటించినట్లయితే అది అమలులోనికి వస్తుందని, వచ్చిన తరువాత, అది ఎసెంబ్లీలో బల్లమీద 14 దినములు ఉంచాలి అని, అది వుంచినప్పుడు సభ్యులు alert గా ఉండి, దానిని ఒప్పుకోవడమో, reject చేయడమో, లేక మార్పుచేయడమో ఆలోచించుకొని నిర్ణయించుకోవలెనని Rules లో ఉంది ఒక వేళ మెంబర్లు alert గా లేక నిద్ర పోతూంటేగూడ వారిని ప్రభుత్వము నిద్రలేపి అయినా, వారి ఆమోదము పొందికాని ప్రభుత్వము ఏలాంటి notification చేయకూడదు అని స్పష్టముగ ఉన్నది, మంత్రిగారు ఈ విషయము చెప్పకుండానే మాకు delegated legislation కు power ఉన్నది, అది మేము utilise చేసుకుంటున్నామని యీ section సందర్భములో చెబితే ఎట్లా ?

*Mr Speaker* I agree with the Leader of the Opposition that the Government cannot proceed with a draft without the approval of the Legislative Assembly ఈ విషయము మంత్రిగారికి తెలుసును అని అనుకుంటూ, దీనికి వారు సమాధానము చెప్పవలసి ఉంటుంది.

శ్రీ కె. వెంకటరావు . దీనికి మీరు ముందుగానే రూలింగు యిచ్చివేస్తే ఇక నేను ఏమని సమాధానము చెప్పగలను ? ఆ విషయంగూర్చి చెప్పటానికి ఏమీలేదు ఈ క్లాజు పెట్టినప్రకారంగా pass చేయమనే నేను కోరుతున్నాను.

*Mr Speaker* The question is

In line 3, of sub-clause (1) of Clause 5, delete the words "add to"

In line 3 of sub-clause (1) of Clause 5, delete the words "add to, amend or"

In line 3 of sub-clause (1) of Clause 5, for the words "add to, amend" substitute the words "decrease"

In line 3 of sub-clause (1) of Clause 5, for the words "add to, amend" substitute the words "amend to reduce the rate of special assessment"

The motions were negatived

*Sri K L Narasimha Rao* Sir, I beg to move

Delete sub-clause (2) of Clause 5

*Mr Speaker* Motion moved

శ్రీ కె యల్ నరసింహారావు అధ్యక్షా ! notification ను approve చేయవలసి ఉంటుందని మంత్రిగారు చెప్పారు ఆ Notification ను ఎసంబ్లీ approve చేస్తే Act లో amendment తెచ్చినట్లే భావించబడుతుందని వారు చెప్పారు Act లో amendment తీసుకుని రావాలంటే Bill తీసుకుని రావాలి అలా కాకుండా sub-clause (2) ద్వారా తెచ్చిన notification ను House approve చేస్తే అది షెడ్యూలును amend చేసినట్లుగా భావిస్తామని చెప్పటం ఏవిధంగా న్యాయమో నాకు అర్థం కావటంలేదు ఆ విధంగా యాక్టును amend చేసే అధికారాన్ని గవర్నమెంటుకు అప్పగించే అధికారం ఎసెంబ్లీకి వుందని నేను అనుకోవటంలేదు. అందుచేత దీనిని డిలీట్ చేయటానికి మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు. ఇవన్నీ ఇదివరకు House approve చేసిన Act లో వున్నాయి ఇది ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ ఎసంబ్లీలోనే జరిగింది

శ్రీ కె. యల్. నరసింహారావు. తప్పులే సాంప్రదాయం కావలసిన అవసరం మనకు లేదు

శ్రీ కె వెంకటరావు సాంప్రదాయాలనే House లో ఏర్పాటు చేసుకొనేది ఈ House వారు చేసిందే తప్పు అయితే ఇదికూడా తప్పవుతుంది అది right అనుకొని, అమలులో వున్నటువంటిది ప్రత్యేకంగా తప్పుకాదు అందుచేత ఈ clause ను ఇట్లాగే వుంచాలని కోరుతున్నాను

*Mr Speaker* The question is

"Delete sub-clause (2) of Clause 5"

The motion was negatived

*Mr Speaker* The question is

"That Clause 5 stand part of the Bill"

The motion was adopted

Clause 5, was added to the Bill

*Sri M Nagi Reddi* Sir, I beg to move

Add the following as Clause 6 at the end of the existing Clause 5

"6 Determination of special assessment and issue of demand notice — The Village Officers shall determine the special assessment payable by a person and countersigned by the Revenue Inspector after making such enquiry, if any, as they consider necessary and cause a notice of demand to be served on the person concerned specifying the amounts of special assessment payable by him Such amount shall be payable within 30 days from the date of service of the notice of the demand"

Add the following as new clause 7 at the end of the above new Clause 6

"7 Appeal — Any person aggrieved by a notice of demand served under Section 6 may within fifteen days from the date of service of such notice on him appeal to the Tahsildar whose decision shall be final"

*Mr Speaker* · Motion moved.

* శ్రీ యమ్. నాగిరెడ్డి అధ్యక్షా, ఈ బిల్లులో అప్పీలుకు ఏవిధమైన అవకాశం లేకుండా వున్న పరిస్థితివుంది ప్రభుత్వం తీసుకువచ్చే బిల్లులన్నీ అవి

గవర్నమెంటుకు, గవర్నమెంటు తాబేదార్లకు లేనిపోని అధికారాలు ఇచ్చే విధంగా తయారవుతున్నవి రెవెన్యూ ఇనస్పెక్టర్ డిమాండు నోటీసును తయారుచేయాలని, అందులో తప్పు వుంటేగాని, ఏదైనా ఆక్షేపణ వుంటేగాని అప్పీలు చేసుకోవచ్చునని సర్చార్జిబిల్లులోని ఒక క్లాజులో పెట్టాము దానిలో మాత్రం కరణం మున్సబులు ఏ లెక్కలు వ్రాస్తే అవే నిజమవుతాయి అసలు పన్నుకు సర్వేనెంబరు ప్రకారం కట్టవలసిన శిస్తుకంటె ఎక్కువ కట్టించుకొంటే తహసిల్దారుకు గాని, కలెక్టరుకు గాని పిటిషన్ పెట్టుకోవచ్చును కాని ఈ అదనపు శిస్తువిషయంలో అటువంటిది లేకుండావుంది "4 ఎకరాలలో మిర్చి వేసినా ఒకరూపాయి నాకుఇస్తే ఒక ఎకరములో మిర్చి వేశావని వ్రాస్తాను" అని కరణం మునసబులు అనవచ్చు రైతులపై కక్షవుంటే ఒక ఎకరంలో వేసినా నాల్గుఎకరాలలో వేశావు కాబట్టి రు 12-0-0 ఇమ్మని వసూలుచేసే అవకాశంకూడా వుంది కరణం మునసబులు జీతాలు పెంచమంటున్నారు పెంచే స్తోమత ప్రభుత్వానికి లేదు కాబట్టి ఈ విధంగానైనా సంపాదించుకోండి అని లోపాయికారిగా వారికి ప్రభుత్వం చెబుతున్నట్లుగా కన్పిస్తున్నది తప్పితే ప్రభుత్వానికి సక్రమంగా రావలసినడబ్బు వచ్చేటట్లుగామాత్రం చేయలేదు గుంటూరు జిల్లాలో జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో కిస్తీ వసూలుచేస్తారు అప్పటికి లెక్కలు తయారుచేసి వుంచుతారు కాని ప్రత్తిపంట ఏప్రిల్, మే నెలలలో వస్తుంది మిర్చి ఫిబ్రవరి, మార్చినెలలలో వస్తుంది. కిస్తీ వసూలు జనవరిలో మొదలుపెడతారు రెండోసారి మిర్చిగాని, వేరుశనగగాని వేస్తే మే, జూన్ నెలలలో పంటవస్తుంది శిస్తు డిసెంబరు, జనవరి, ఫిబ్రవరి నెలలలో వసూలుచేస్తే ఎంతవేసినారో తేలని వ్యాపార పంటలుకూడ వున్నాయి ప్రత్యేకంగా వాటికి లెక్కలు తయారుచేయవలసిన అవసరంవుంది ఫలానా రైతు ఎకరం భూమిలో మిర్చివేశాడు కనుక రు 3-0-0 లు ఎకరం వేరుసెనగ వేశాడు కాబట్టి రు 1-0 0 అని ప్రత్యేకంగా డిమాండు నోటీసులు తయారుచేసి వసూలుచేయాలని మనవిచేస్తున్నాను అలా చేయకుండా శిస్తులోనే అది కలిపితే ఇబ్బందిగా ఉంటుంది. "వ్యాపారపంటలపై పన్నువేస్తే, ఇన్ని లక్షలు వస్తుంది" అని ప్రభుత్వం చెబుతున్నది ప్రత్యేకంగా ఎన్ని ఎకరాలలో ఈ పంట వేయబడిందన్నీ కరణం మునసబులవద్ద లెక్కలు వుండవు. ప్రత్యేకమైన రిజిష్టరు ఉండదు. అంతా శిస్తులో కలిసి వుండటంవల్ల దేనిపై ఎంత ఆదాయం వస్తుందో అంచనా వేయటానికీ వీలు వుండదు. ఒక ఊరిలో 7,8 వేలు డౌలు వుంటే, దానికి వ్యాపారపంటలపై వచ్చే డౌలుకూడా కరణం మునసబులు కలుపుతారు అందువల్ల ప్రత్యేకంగా వ్యాపారపంటలపై, ప్రత్యేకంగా శిస్తుపై సర్చార్జీపై, ఎంత వస్తుందని తెలుసుకోటానికి అవకాశంలేదు. ఎన్ని ఎకరాలు

వేసినా కరణం మునసబులు తమ ఇష్టంవచ్చినట్లు ఎక్కువగాని తక్కువ గాని వ్రాసి లోపాయికారి వ్యవహారములు జరపటానికి ప్రభుత్వం అవకాశం కల్పిస్తున్నట్లు ఉన్నది తప్పితే ప్రభుత్వానికి ఆదాయం వచ్చేరీతిగా లేదని మనవి చేస్తున్నాను తమ ఇష్టంవచ్చినట్లుగా రైతు వేసినా వేయకపోయినా వసూలు చేసే అధికారం వుంది

రైతులు ఒకపైరు కోసిన తరువాత మెట్టప్రాంతంలో గుంటకలు తోలుతారు నిమ్మతోటలు మాగాణిభూమి ప్రాంతంలో ఉన్న వెంకట్రావు గారికి ఈ విషయం తెలియదు పైరు కాగానే అరకలు తోలుతారు దంతలు తోలుతారు గుంటకలు తోలుతారు పైరు వేసిందీవేయనిదీ కూడా కనిపించదు తహసీల్దారుకు పిటిషన్ పెట్టుకున్నా ఆయన June, July నేలలలో వస్తే అప్పటికి అరక, గుంటక తోలేస్తే జొన్న వేశాడో, సజ్జ వేశాడో కన్పించదు Prove చేసుకొనే అవకాశం రైతుకులేదు అందువల్ల ప్రత్యేకంగా డిమాండునోటీసు పెట్టే అవకాశం వుండాలని చెబుతున్నాను 'కలెక్టరు' "డిప్యూటి కలెక్టరు" అని అంటే చాలా ఖర్చుకాదా అని వెంకట్రావుగారు అనవచ్చు అందువల్ల వ్యాపారపంట ఎంతవేసినాడో గ్రామోద్యోగులే లెక్కలు వ్రాస్తే దీనికి రెవెన్యూ ఇనస్పెక్టరు కౌంటర్ సిగ్నేచర్ ఇవ్వాలి వీళ్ళిద్దరు approve చేసిన తరువాతకూడా ఇది తప్పని డిమాండు నోటీసు final గా తహశీల్దారుకు ఇవ్వాలి ఇట్లా చేయకపోతే గవర్నమెంటుకు ఆదాయం తగ్గుతుంది రైతుకు నష్టం వస్తుంది కాబట్టి దానిని ఈ clause లోకూడా పెట్టటానికి మంత్రిగారు అంగీకరించాలని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను *

*శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు అధ్యక్షా, ఇది చాలా ముఖ్యమైన సవరణ యని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను ఇప్పుడు మనం taxation measures లో appeal చేసే అధికారం యిస్తూ వచ్చాము మొన్న తెచ్చిన Wet Assessment Bill లో అటువంటి అవకాశం కల్పించారు Sales Tax లో సరిగా అంచ నాలు వేయకపోతే, దానిమీద appeal చేసుకునే అధికారాలున్నాయి ఆ విధ ముగా ప్రతిదాంట్లోకూడ appeal చేసుకునే అధికారాలున్నాయి. మనం ఈనాడు commercial crops ను గురించి ఆలోచిస్తున్నాము కాని, దీనికి అట్టి appeal చేసుకునే అవకాశం ఎందువలన కలిగించలేదో నాకు అర్థం కావడము లేదు. గ్రామ కరణాలు లెక్కలు తయారుచేస్తారు కాబట్టి గ్రామంలోవుండే పరిస్థితులన్నీ వారికి బాగా తెలుస్తాయి ఒకవేళ వారు సదుద్దేశంతోనయినా, తప్పుడు లెక్కలు తయారుచేస్తే వాటిని సరిదిద్దుకోడానికి మార్గాలు ఏమిటి

అనే విషయం మనం ఆలోచించవలసిన అవసరం ఉన్నది. Appeal చేసుకునే హక్కు కలిగించకపోయినట్లయితే, రైతు చాలా అన్యాయానికి గురి అవుతాడు గ్రామకరణాలు, యింకా అక్కడవుండే యితర ఉద్యోగస్తులు arbitrary గా వారి యిష్టంవచ్చినట్లు వ్యవహరించేందుకు యీ బిల్లు అవకాశం కల్పిస్తోంది కాబట్టి యీ బిల్లులో appeal కు provision కలిపించవలసిన అవసరం ఉన్నది ఆ క్లాజు యీ బిల్లులో missing గా ఉన్నది, కనుక ఏదో ఒక రూపంలో చేర్చాలని తెలియచేస్తున్నాను

*శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, నేను మంత్రిగారిని కోరేది ఒకే ఒక్క విషయం పెద్ద పెద్ద సిద్ధాంతాలు, ప్రభుత్వానికి పెద్ద నష్టంవచ్చే విషయాలు అయితే అవి యిప్పుడు అంత తేలికగా కావు లెక్కలు తయారుచేసినట్లయితే, పన్నులు వసూలుచేయడానికి, డిమాండు నోటీసు యివ్వడానికి Surcharge Bill లో ఏర్పాటుచేశారు, Commercial crops కు సంబంధించికూడా గ్రామోద్యోగస్థులు లెక్కలు తయారుచేస్తే, Revenue Inspector వాటిని check-up చేసి notice యివ్వాలని, తరువాత appeal చేయాలంటే తహశీల్దారే final authority అనేటటువంటి క్లాజులు చాలా న్యాయమైనవి దానిని గురించి మిగిలిన శాసనసభ్యులంతా వివరించి చెప్పారు Demand notice, appeal authority యిటువంటివి లేకపోతే యీ procedure లో అనేక చిక్కులు వస్తాయి కాబట్టి కేవలం గ్రామ మున్సబులకే సర్వాధికారాలిచ్చే విధంగా కాకుండా, కొంత check-up ఉండడానికి Surcharge Bill లో వలెనే దీంట్లోకూడా appeal చేసుకోడానికి ప్రభుత్వం అంగీకరించాలని నేను కోరుతున్నాను ఇది పెద్ద సిద్ధాంతాలకు సంబంధించినది కాదు ప్రభుత్వానికి నష్టంవచ్చే విషయం కాదు కాబట్టి దీనిని అంగీకరించాలని కోరుతున్నాను

* శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, శ్రీ నాగిరెడ్డిగారికి ఆత్మవిశ్వాసము ఎందుచేతలేదో నాకు అర్థంకావడంలేదు Village administration ను గురించి అనుభవ మున్నవారు నాగిరెడ్డిగారు నాకు అంత అనుభవంలేదు ఒక ప్రక్కన "వారు కష్టపడుతున్నారు, జీతాలు పెంచండి" అంటారు మళ్ళీ రెండవ వైపున "వారంతా దగాచేసి క్రొత్తగా సంపాదించుకోడానికి యీ బిల్లు వల్ల అవకాశం కల్గిస్తున్నారు" అంటారు ఆయనే అందుచేత వారికి యింత ఆత్మవిశ్వాసం లేకపోవడం ఆశ్చర్యంగానే ఉన్నది

ఇక అసలు విషయాన్ని గురించి చెబుతున్నాను ఇది flat rate Surcharge Bill లో slab rate ఉన్నది కనుక, Appeal కు provision ఏర్పాటు చేయవల

సిన అవసరం ఉన్నది ఇది flat rate అయితే, యీ flat rate మీద appeal పెట్టాలని ఏ grounds తో argue చేస్తున్నారో, అదే grounds మీద మొత్తం land taxes అన్నిటిమీదా appeal కు పెట్టవలసిన అవసరం ఉన్నది ఈ సందర్భంలో గౌ॥ సభ్యులు చెప్పిన విషయాలను దృష్టిలో పెట్టుకొని నేను రెండు విషయాలు చెబుతున్నాను

(1) Village Officers Committee వారు యీ వేళో, రేపో తమ రిపోర్టును యివ్వదలచుకున్నారు రైతులకు విలేజి ఆఫీసర్సుకు మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలలో గడబిడ లేకుండా చేసేందుకు, general గా యీ taxation మొత్తం మీద తగినటువంటి provisions సూచించేందుకు కొన్ని proposals ఉన్నాయని నేను చూచాయగా విన్నాను వాటినికూడా దృష్టిలో పెట్టుకోవలసినదని సభ్యులను కోరుతున్నాను

(2) Check-up ను గురించి సభ్యులంతా చెబుతున్నారు కనుక దానిని గురించి నేను రూల్సులో provide చేసి సంతృప్తి కలుగ జేస్తానని మనవి చేస్తున్నాను

శ్రీ యం నాగిరెడ్డి అధ్యక్షా, అసలు వ్యాపార పంటలమీద ఎంతపన్ను వేస్తున్నదీ తెలియడానికి అవకాశం ఉండాలి. దీనిప్రకారం అదికూడా తేలడం లేదు

*Sri M Nagi Reddi* Sir, I beg leave of the House to withdraw my amendments Nos 54 and 55

The amendments were, by leave of the House, withdrawn.

*Clause* 6

*Mr Speaker* The question is

That Clause 6 stand part of the Bill.

The motion was adopted.

Clause 6 was added to the Bill.

*Clause* 7.

*శ్రీ కె వెంకటరావు · అది సరియైన సమయంలో District Gazette లో ప్రకటించడం లేదంటున్నారు. అది Education Secretary గారితో మాట్లాడి ఆ ఏర్పాటు చేస్తాను.

శ్రీ ఎమ్ నాగిరెడ్డి అధ్యక్షా, నేను నెం 56 సవరణను move చేయడములేదు

*Mr Speaker* The question is

That Clause 7 stand part of the Bill

The motion was adopted

Clause 7 was added to the Bill

*Clause* 8

*Mr Speaker* The question is

"That Clause 8 stand part of the Bill "

The motion was adopted

Clause 8 was added to the Bill

*Clause* 9

*Sri B Sankaraiah* Sir, I beg to move

"That in line 4 of clause 9, after the words "(Madras Act XXVI of 1948) ''insert the words "or to any Inam land in an Inam village, hamlet or Khandriga"

*Mr Speaker* Motion moved

*శ్రీ బి శంకరయ్య, అధ్యక్షా, మొన్న సర్చార్జిబిల్లు వచ్చిన సందర్భములో మేము యీ సవరణ పెట్టినప్పుడు "Estates అయిన ఈనాం గ్రామాలను మాత్రం మినహాయించి, మిగిలిన చిన్నచిన్న ఈనాములన్నింటిమీద వేస్తామ"ని మంత్రిగారన్నారు అయితే Estates అయిన పెద్దగ్రామాలమీద వేస్తే ఎక్కువ ఆదాయం వస్తుంది, వాటిమీద ఎందుకు వేయకూడదు అంటే వాటిమీద పన్ను వేస్తే మనం యివ్వవలసిన compensation ఎక్కువగా ఉంటుంది అన్నారు కాని అది ఏవిధంగా ఎక్కువ అవుతుందో తెలియడం లేదు ప్రభుత్వానికిచ్చే పన్నును యిప్పుడు యింకా ఎక్కువ చేస్తున్నాము అందువల్ల ఆ రైతులమీద అదనంగా వసూలు చేసినప్పటికీ, ప్రభుత్వం తీసుకొన్నది మినహాయించి, compensation యిస్తారు ఆ వాదం అట్లా ఉంచుదాము కొన్ని కంద్రికలు Estates కావలసి యున్నవి ఇంకాకొన్ని గ్రామాలు Estates కావలసి ఉన్నవి, ఇప్పుడు Estates అయిన వాటిని మాత్రం మినహాయించి తక్కువ ఈనాంగ్రామాల్ని,

యీనాం కంౘ్రడికలు ఈనాం మజరాలు చిన్నచిన్న గ్రామాలమీద మాత్రం పన్నులు వేయడం సబబైన విషయం కాదు 1956 వ సం. Act ప్రకారం కొన్ని కంద్రికలను, మజరాలను estates గా పరిగణించవలసిన అవసరం ఉన్నది అంటే estates గా ప్రకటించేలోపల పన్నులమీద పన్నులు వేయాలనా ? అల్లా ప్రకటిస్తే—మంత్రిగారు చెప్పినట్లుగా ఎక్కువగా నష్టపరిహారం యిచ్చుకో వలసిరావచ్చు ప్రకటించిన తరువాత ఎక్కువ నష్టపరిహారం ఎల్లాగూ యిచ్చుకో వలసి వస్తున్నది కదా ఏవిధంగా చూచినప్పటికి కూడ ఎక్కువ పన్నులు తీసుకో డానికి అవకాశం ఉండే పెద్దపెద్ద ఈనాందారులమీద ఏ బిల్లులు తీసుకువచ్చినా కూడ పన్నులు వేయము 'Estate Lands Act ప్రకారం estates అయినవాటిని మినహాయించాలి' అని చెబుతున్నారు. అంతేకాని, ఈనాములన్నీ ఎస్టేటులు కావలసివున్నాసరే, చిన్నచిన్న కంద్రికలు అయినా, మజరాలు అయినా చాకిరీ ఈనాము అయినా వారిమీద పన్నులు వేయడం న్యాయం కాదంటూంటే విని పించుకోవడంలేదు 1 ఎకరం ½ ఎకరంవుండి చాకిరీవృత్తులు చేసుకుంటున్నవాని మీద కూడ పన్నులు వేయడం న్యాయంకాదు అని 1956లో full assessment వేసేటప్పుడుకూడా ప్రభుత్వం అంగీకరించింది మళ్లా చిన్న చిన్నవారందరిమీదా పన్నులు వేయడానికి బిల్లులు తీసుకువస్తున్నారు ఇది మంత్రిగారు చెప్పిన విషయాలనుబట్టి కూడా సరైనది కాదు Compensation ఎక్కువ అవుతుందనే వాదనకూడా సరైనదికాదు అదే నిజమైతే, యిప్పుడు estates గా తీసుకో దలచిన గ్రామాలకుకూడా ఎక్కువ అవుతుంది చిన్నవాటి మీదనే ఎందుకు వేయాలి ? ఇదివరకు ఆలోచించి అన్నిపక్షాలుకూడా చిన్నవారిమీద వేయ కూడదని అంగీకరించి మినహాయించినవాటిమీద కూడా యిప్పుడు ఎందుకు వేయాలి ? ఆ విధంగా discrimination తీసుకువచ్చి పెద్దవారిమీద వేయము, చిన్నవారిమీదనే వేస్తాము అనే విధానం బాగుండలేదు చిన్నవాళ్ళమీద అదనపు పన్ను వేయవద్దని, చాకిరీ ఈనాములు మొదలైనవాటిని మినహా యించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు. అధ్యక్షా, శ్రీ శంకరయ్యగారు చెప్పినది పూర్తిగా అర్థం కాలేదు నేను అర్థం చేసుకోగలిగినంతవరకు వారికి ఒక అపోహ ఉన్నట్లు తోస్తోంది నష్టపరిహార మనేదానితో వారు మొదలుపెట్టారు. దానికి దీనికి సంబంధం లేదు. నేను interim payment ను గురించి చెప్పాను. Compensation కు interim payment కు సంబంధం లేదు పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళు అంటూ ఆ "వాళ్లు" గురించి ఆయన ఎపుడూ చెబుతూ ఉంటారు నేను 13 పేర్లు చదివాను. అవి non-taken over estates. వాటిలో పెద్దవాళ్ళు లేరు. పెద్దవాళ్ళనుంచి ఇదివరకే తీసుకున్నాం.

శ్రీ బి శంకరయ్య "వెయ్యి" అని చెప్పారు

శ్రీ కె. వెంకటరావు అది ఒక అపోహ దరిమిలా ఈనాం గ్రామాల విషయం వేరు ఒక ఎస్టేటుగ్రామంలో 4 ఎకరాలు దరిమిలా ఈనాం క్రింద ఉంటే అదికూడా ఎస్టేటుక్రిందే లెక్క మనము ఇచ్చే compensation లో ఈ దరిమిలా ఈనాందారుకు కూడా ఇవ్వాలి కనుక ఆ claim పెండింగ్‌లో ఉన్నది ఇంకా తీసుకోవలసిన ఎస్టేట్లు ఆంధ్రప్రదేశంలో 13 ఉన్నాయి ఏ ఎస్టేటుకైనా interim payment అంటూ ఉన్నది Interim payment మీద surcharge వేసినట్లయితే రు 100 లు ఆestate మీద rent క్రింద వేసినట్లయితే ఇప్పుడు క్రొత్తగా వేసిన పన్నులవల్ల రు 130 లు ఇవ్వాలి ఈ అదనపు రు 30 లలో రు 3 లు గవర్నమెంటుకు వస్తుంది మిగిలిన రు 27 లు ఎస్టేటు హోల్డరుకు వెళ్ళుతుంది ఇది compensation లెక్కలోనికి రాదు Non-taken-over estates కు ఈ Act వర్తించదు క్రొత్తగా declare అయిన estates మీద ఈ పన్ను లేదు Surcharge కూడా లేదు వారిమీద పన్ను వేయడం లేదు కాబట్టి ఇది అనవసరమైన విషయం.

*Mr. Speaker* The question is

"In line 4 of clause 9, after the words '(Madras Act XXVI of 1948)' insert the words 'or to any Inam land in an Inam village, hamlet or Khandriga' "

The motion was negatived

*Sri M Nagi Reddi* I beg to move

"Add the following as sub-clause (2) of clause 9-

'(2) Nothing contained in this Act shall apply to any encroachment land' "

*Mr Speaker* Motion moved

శ్రీ ఎమ్. నాగిరెడ్డి ప్రభుత్వంవారు ఎన్నోపన్నులు వేస్తున్నారు. పన్ను అతోబాటు శివాయిజమా, బంజరు భూములు సాగుచేస్తూ ఉంటే, వాటిమీద penalties వేస్తున్నారు. 20, 30 సెంట్ల భూములుగా ఉన్న encroachments ఎన్నో ఉన్నాయి. వాటిలో ఆహార పదార్థాలు వేస్తే గిట్టుబాటు కాదని, commercial crops వేస్తూఉండడం కద్దు. కనీసం వాటిమీద penalties కాని, అదనపు పన్నులుగాని లేకుండా చేయమని కోరుతున్నాను.

శ్రీ కె వెంకటరావు ఇది అనవసరమైన విషయం Encroach చేసిన వాళ్ళు చిన్నవాళ్ళు ఉన్నారు పెద్దవాళ్ళు ఉన్నారు ఎవరుచేసినా అది తప్పే అవుతుంది అటువంటివారిపైననే పెనాల్టీలు పడతాయి కాని సక్రమంగా సాగుచేసుకుంటే పెనాల్టీలేదు కృష్ణాజిల్లానుంచి నా దగ్గరకు ఒకరు వచ్చారు ఆయన 200, 300 ఎకరాల భూమి encroach చేసి పొగాకు వేసికొన్నారు అటువంటివారికి concession ఇవ్వాలంటే ఎలా కుదురుతుంది అందువల్ల ఇటువంటి సవరణ అంగీకరించడానికి వీలులేదు

*Mr Speaker* The question is

"Add the following as sub-clause (2) of clause 9-

'(2) Nothing contained in this Act shall apply to any encroachment land' "

The motion was negatived

*Mr Speaker* The question is

"That Clause 9 stand part of the Bill"

The motion was adopted

Clause 9 was added to the Bill

*New Clause* 10

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move

"Add the following as new Clause 10 —

10 Repeal —The Andhra Pradesh Land Revenue (Surcharge) Act, 1957 and the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Act, 1957, are hereby repealed "

Additional Wet Assessment ఉన్నది. ఇది amending Act. ఒకవేళ అసలు Act పోతే ఇదికూడా పోయినట్లే అవుతుంది అదేవిధంగా Land Revenue Surcharge Act కూడా పోతుంది

*Sri K Venkata Rao*. Sir, the amendment is out of order. There is nothing called the Andhra Pradesh Land Revenue (Surcharge) Act, 1957 or the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Act, 1957

వెంకటేశ్వర్లుగారు చెప్పినది సరిఅయినట్లైతే ఆ Act కు చివర 1957 అని ఉండనక్కరలేదు కాబట్టి ఈ సవరణ చెల్లదు

*Mr Speaker* So, this amendment is ruled out Now, we shall go to the Schedule

మిస్టర్ స్పీకర్ షెడ్యూల్‌కు సంబంధించినంతవరకు సవరణలను పైరువారీగా చర్చించడం మంచిదనుకుంటాను

*Schedule*

*Sri Baswa Maniah* (*Andole*) I beg to move

"For the words 'per acre' substitute the words 'over ten acres'

*Mr Speaker* Motion moved

**श्री बस्वा मानैया** मोअज़िज सदरे मुकंनैना व मोअज़िज अर्काने मुकनैना। यह जो ब्योपार करने के अजनास पर टेक्स डाला जा रहा है, उनके मुताल्लेक मैने जो तर्मीम पेश की है, वह बहुत ही अहम है और इसकी सख्त जरूरत है। इसकी वजह यह है कि इस बिल को राय-आमा के लिए भेजने के सम्बन्ध मे मिनिस्टर साहब ने फरमाया कि यहाँ सब चुने हुए लोग है और अव्वाम ही के नुमाइन्दे हैं, इस लिए मजीद अव्वाम की राय लेने की क्या जरूरत है? मगर एलेक्शन मैनिफेस्टो मे टेक्स डालने का जुज्व ही नही है। मैनिफेस्टो मे अव्वाम की जरूरियात खाना, मकान, जमीन और सारी सहूलतो को पूरा करेंगे बतलाकर अब असेंबली मे उसी मेनिफेस्टो के खिलाफ जब टेक्स आयद करने की कोशिश की जारही है तो उसी सूरत मे इस बिल को राबे अम्मा के लिये भेजा जाना यह बुन्यादी चीज हो जाता है। लेकिन इस तजवीज को मिनिस्टर साहब ने रद्द कर दिया। मै जल्द ही वक्त के अन्दर अपने खयालात को खत्म कर दूँगा।

इसमें मिम्स पैदावार पर एक रुपये से पाँच रुपये तक टेक्स डालने के जो अश्या हैं, उस में १०० एकर के अन्दर सब अनाज को मिला कर टेक्स डालने की जो तजवीज है, उस में ज़्यादा से ज़्यादा महसूल आयद करने का जुज़्व लिये हैं। कम को कुबूल नहीं किये हैं। अपोजीशन की तरफ़ से मुताद्दिद तरीक़ो से हुकूमत के सामने यह रखा गया कि ग़रीब काश्तकरों की सहूलत की कोशिश की जाये और उसके अन्दर तशख़ीस का एक तरीखा रखा जाय कि किस प्रोपोरशन से एक रुपये से पाँच रुपये तक के महासिल आयद होंगे। लेकिन इनको भी वह नहीं माने ..

**श्री अध्यक्ष** आप १० एकर के अन्दर ही के बारे मे कहिये ।

**श्री बख्शा मानैया** मै उसी पर कह रहा हूँ। इसको क्यो पास करने की जरूरत है, मै यह बतला रहा हूँ। मेरा कहना है कि १० एकर से ज्यादा की जमीन पर डालिये। सर्चाज मे जिस तरह सहूलत दी गई है, उसी तरीके से यहाँ भी एक रुपये से पाँच रुपये तक के अजनास ब्योपार किये जाते है, उनको देखिये। इससे एक से १० एकर तक की काश्त करने वाले काश्तकारो का फायदा होता है। १० एकर से ज़्यादा के जमीन्दार बड़े-बड़े सर्मायदार होते हैं। वह खुद काश्त नही करते बल्कि गरीबो से काश्त करवाते है। वह सिर्फ निगरानी करते है। काश्त करने वाला तो वही होता है, जो सुबह ४ बजे उठ कर लङ्गोट लगा कर दिन भर भूखा रह कर खेत मे काम करता है। इस लिये मेरा कहना यह है कि एक एकर से दस एकर तक जो काश्त करते है, उनको मौक़ा देना चाहिए।

(Bell-)

मै दो ही मिनट मे अपनी तकरीर खतम कर देता हूँ।

**श्री अध्यक्ष** इसकी क्या जरूरत है? आपका मतलब मालूम हो गया कि जो काश्तकार १० एकर से कम की जमीनात काश्त करने वाले है उनको छोड दिया जाये। इस पर मिनिस्टर साहब क्या कहते हैं देखेगे।

**आनरेबल श्री कला व्यंकटराव** अध्यक्ष महोदय! मुझको अफ़सोस है कि पूज्य बख्शा मानैयाजी की सलाह को मानने के लिए तैयार नहीं हूँ।

*Mr Speaker* The question is

"For the words 'per acre' substitute the words 'over ten acres' "

The motion was negatived

*Sri P Sundarayya* I beg to move.

For item 1 of the Schedule, substitute the following :—

| Crop | Below 5 acres | 5-10 acres. | Over 10 acres |
|---|---|---|---|
| Casuarina | Nil | 0—8—0 | Re. 1—0—0. |

*Mr Speaker* : Motion moved.

*Sri G Yellamanda Reddi* I beg to move

For item 1 of the Schedule, substitute the following —

| | Crop | Below 5 acres | 5-10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 1 | Casuarina. | Nil | Re 1 | Rs 2 |

*Mr Speaker* Motion moved

*Sri G Ganga Reddi* I beg to move

For item 1 of the Schedule, substitute the following —

| | Crop | Below 3 acres. | 3-5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 1 | Casuarina | Nil | Re 1 | Rs 2 |

*Mr Speaker* Motion moved

*Sri K L. Narsimha Rao* I beg to move

For item 1 of the Schedule, substitute the following —

| | |
|---|---|
| 1. Casuarina | After exempting one acre for every cultivator for personal use, Rupee one per acre |

*Mr Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya*. I beg to move

In item 1 of the Schedule, for the words and figures "Re 1" substitute the words and figures "Np 50"

*Mr Speaker* Motion moved

శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోల్). సరుగుడు వేసిన మూడు నాలుగు సంవత్సరాలకు కాని చెట్టు పెద్దదికాదు. ఐతే యీ మూడు నాలుగు సంవత్సరాలకుకూడా రైతు అదనంగా పన్ను చెల్లించడం న్యాయముకాదు అందువల్ల మూడు ఎకరాలలోపు సరుగుడు వేసుకునే రైతుపై పన్ను విధించరాదు మూడునుంచి ఐదు ఎకరాలవరకు వేసుకునేవారిపైన ఒక రూపాయి, 5 ఎకరములపై సరుగుడు వేసేవారిపైన ఎకరమునకు 2 రూపాయల చొప్పున పన్ను విధించవలసి యుంటుంది. ప్రభుత్వము వారి విధానము చెప్పినంత చేయాలి,

చెప్పినట్లు వినాలి అనేటట్లుగా ఉంది ఎటువంటి విచారణా లేకుండా యీ పన్నులు విధిస్తున్నారు ఇదివరకు తెలియకపోయినా మేము చెపుతున్నాము కనుక ఇకనైనా తెలుసుకుని యీ పన్నులను మా సవరణమేరకు తగ్గించవలెనని కోరుతున్నాను

శ్రీ కె యల్ నరసింహారావు నేను 2 సవరణలిచ్చాను ఒక సవరణ ప్రకారం 5 ఎకరాలలోపు నరుగుడుతోట ఉన్నవారిని మినహాయించమని కోరాము అంతేకాకుండా 5 నుంచి 10 ఎకరాలవరకు ఎకరమునకు అర్ధ రూపాయి చొప్పున, 10 ఎకరాలపైన ఎకరానికి రూపాయి చొప్పున వసూలు చేయమని నేను సూచిస్తున్నాను ఏకారణమువల్లనైనా మినిష్టరుగారు అంగీకరించటానికి సిద్ధపడకపోయినట్లయితే నా రెండవ సవరణ అంగీంరించవలసిదని వారిని కోరుతున్నాను ఒక యకరము విస్తీర్ణమువరకూ స్వంత ఉపయోగము నిమిత్తము నరుగుడు వేసుకునేవారిని మినహాయించవలెనని నా సూచన ల్యాండు రెవిన్యూ సర్ చార్జి బిల్లులో 10 రూపాయలులోపు చెల్లించేవారిని ఎగ్జంప్టు చేశారు అదే విధంగా స్వంత ఉపయోగం నిమిత్తము ఒక యకరము వరకు నరుగుడు వేసుకునేవారిని మనహాయించవలెనని కోరుతున్నాను చిన్న రైతులపైన వీలయినంత తక్కువ పన్ను విధించవలెననే నా సవరణల ముఖ్యోద్దేశ్యము అంతేనే కాని మన అభివృద్ధి ప్రణాళికలు కొనసాగించేనిమిత్తము చిన్న రైతులపైనకూడా పన్ను విధించి వారు యీ ప్రణాళికలను అసహ్యించుకొనేటట్లు చేయవద్దని మనవిచేస్తున్నాను గ్రెడేషన్ పద్ధతిని ఏర్పాటుచేసి చిన్నవారిపైన తక్కువ పన్ను పెద్దవారిపైన అదనపు పన్నులు విధించడము సక్రమమైన విధానము అంతేనే కాని చిన్నా పెద్దా తారతమ్యము చూడకుండా ఫ్లాట్ రేట్లును వడ్డించ పూనుకోవద్దని, నా మొదటి అమెండ్ మెంట్ ను అంగీకరించమని కోరుతున్నాను ఒకవేళ ఏకారణము వల్లనైనా దానిని వారు అంగీకరించలేకపోయినట్లయితే మా 6 వ ఎమెండుమెంటును—బీదరైతులు స్వంత అవసరాలకు ఒక ఎకరమువరకు నరుగుడు వేసుకున్నట్టయితే దానిని మినహాయించవలెనని కోరుతున్నాను మంత్రిగారు యీ సవరణను అంగీకరించటానికి వారికి సలహా యివ్వవలెనని కోరుతున్నాను.

మిష్టర్ స్పీకర్ సలహా యివ్వడానికి నాకు హక్కు లేదు ఉంటే ఎటో అటు ఇస్తాను—వారిని అంగీకరించమనో, లేక మిమ్ములను మాట్లాడవద్దనో, కాని నాకు ఆ హక్కు లేదు.

*Sri M Nagi Reddi* I beg to move

"Delete item 2 of the schedule "

*Mr Speaker* Motion moved

*Sri V Visweswara Rao* Mr. Speaker, Sir, I beg to move

"For item 2 of the schedule, substitute the following —

| Crop | Below 5 acres | 5-10 acres | Over 10 acres |
|---|---|---|---|
| 2 Cotton | Nil | 0-8-0 | Re 1" |

*Mr Speaker* Motion moved

శ్రీ వి విశ్వేశ్వరరావు అధ్యక్షా, ఆంధ్రదేశమునకు సంబంధించినంత వరకు పత్తి చాలా తక్కువ పండుతున్నదని ప్రభుత్వం ప్రకటించిన లెక్కల ద్వారా కూడా తెలియుచున్నది ఆనాటి కానాడు పంట తగ్గిపోతున్నది అంతే కాకుండా దాని ధరకూడ చాలా తక్కువగాయున్నది పశువుల మేతకొరకు (పత్తిగింజల కొరకు) దీనిని రైతులు వేసుకొంటారు అంతేగాని, డబ్బుకొరకు యిదొక వ్యాపారపంటగా ఎక్కువ ప్రాంతాలలో వేయుట జరగటంలేదు ఇది రైతులకు గిట్టుబాటుగాని పంట కాబట్టి, పన్ను వేయకూడదని, పూర్తిగా మినహాయించాలని కోరుతున్నాను రాయలసీమ ప్రాంతాలలో లెక్కలుచూస్తే ఎకరానికి ౫ మళ్ళు కూడ పత్తి కావడంలేదు అటువంటి పరిస్థితులలో దీనిని వ్యాపార పంటగా తీసుకొని పన్ను వేయుట న్యాయం కాదని, పన్ను నుంచి పూర్తిగా మినహాయించాలని కోరుతున్నాను

*Sri K. L Narasimha Rao* Mr Speaker, I beg to move·

"For item 2 of the Schedule, substitute the following —

2 Cotton — After exempting one acre for every cultivator for personal use, Rupee one per acre."

*Mr. Speaker*. Motion moved

*Sri P. Narasing Rao (Huzurabad)*· Sir, I beg to move.

"For item 2 of the Schedule, substitute the following.—

| Crop | Below 3 acres. | 3-5 acres | Over 5 acres. |
|---|---|---|---|
| 2. Cotton | Nil | 0-8-0 | Re 1" |

*Mr Speaker* Motion moved

*శ్రీ పి. నరసింగరావు అధ్యక్షా, ప్రభుత్వం యిచ్చిన షెడ్యూలు, Explanation (1) లో Casuarina, Coconut, Plantains, Chillies, Citrus fruit-- వీటికి కనీసం 10 సెంట్సులో వేసేపంటవరకు exemption యివ్వటం జరిగింది పత్తి పూర్తిగా నాలుగునెలల పంట సహజంగా బీదవాళ్ళు రెండు మూడు ఎకరాలలో వెసుకుంటారు పంటకూడ సక్రమంగా పండదు కాని దీనికి exemption ఏమీ యివ్వబడలేదు నా సవరణలో కోరిన ప్రకారము 3 ఎకరాలవరకు exemption యిచ్చి, 3 నుంచి 5 ఎకరాలవరకు ఎకరానికి 0-8-0 చొ, అయిదు ఎకరాలపైన ఎకరానికి రు. 1/- విధిస్తే, చిన్నరైతులకు exemption దొరుకుతుంది Gradation విధానం ప్రకారం progressive taxation element దీనిలో కూడ తీసుకువచ్చే అవకాశం ఉంటుంది కాబట్టి, యీ సవరణ అంగీకరించాలని కోరుతున్నాను.

*Sri Vavilala Gopalakrishnayya* Mr Speaker, Sir, I beg to move

"In item 2 of the Schedule for the words and figures 'Re 1" substitute the words and figures 'Np 50"

*Mr Speaker* Motion moved

*Sri G Ganga Reddi* Mr Speaker, I beg to move

"For item 3 of the Schedule, substitute the following —

| Crop | Below 1 acre | 1-3 acres | 3-5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 3. Coconut | Nil | Rs 2 | Rs 3 | Rs 5 |

*Mr. Speaker* Motion Moved

*శ్రీ గోపిడి గంగారెడ్డి. అధ్యక్షా, కొబ్బరిమీద పన్ను విధించుట - పంట వచ్చిన తరువాతనా ? రాకముందా ? అది యిందులోలేదు కొబ్బరి మా ప్రాంతంలో లేదుగాని యీ పంట ఎన్నిపండ్లకు వస్తుంది ? పత్తి జొన్నతీరున పండుతుందా ? వీటిమోస్తరుగా కొబ్బరిపైనకూడ పన్ను వేసినారు పది పండ్లకుగాని, బలముగా ఉన్నచెట్టయితే 8 పండ్లకుకాని కాపుకు (పంటకు) రావచ్చును. అందుచేత దీనిమీద మొదటినుంచి పన్ను వేస్తే 10 పండ్లవరకు దండుగగా కట్టుకోవాలి ఇది న్యాయమా ? యిది పన్నుకాదు ప్రాణము

తీసేదిలా కనపడుతున్నది ఒక ఎకరంవరకు పన్ను విధించకుండా, ఎకరం పైన రు 2 లు చొ॥ మూడు ఎకరాలనుంచి 5 ఎకరాలవరకు రు 3 లు చొ॥ యీ తీరుగా పన్ను విధించాలని మనవి చేస్తున్నాను ఈ పంట వచ్చేవరకైనా పన్ను లేకుండా చేయాలి. లేకపోతే ఒక ఎకరంవరకైనా పూర్తిగా మాఫీ యివ్వాలని కోరుతూ, ప్రభుత్వం నా సవరణ ఒప్పుకుంటుందని తమద్వారా వినతి చేస్తున్నాను

*Sri A Venkatarama Raju (Razole - General)* Mr Speaker, Sir, I beg to move

"For item 3 of the Schedule, substitute the following -

| Crop | Below 1 acre | 1-5 acres | 5-10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 3 Coconut | Nil | Rs 2/- | Rs. 3/- | Rs 5/-" |

*Mr Speaker:* Motion moved

*శ్రీ వెంకటరామరాజు అధ్యక్షా, కొబ్బరి విషయంలో 10 ఎకరాలకు మించిన పంటమీద, ప్రభుత్వం సూచించినదానికంటె ఎక్కువ వసూలు చేయాలని ఒక సవరణ యిచ్చాము ఎక్కువ ఆదాయాన్ని పురస్కరించుకొని ఇచ్చిన సవరణను మంత్రిగారు కాదంటే, ఎక్కువ ఆదాయం గలవారినుంచి ఎక్కువ వసూలు చేయుటకు ఏది ఆలోచనలో లేదనుకోవాలి ఈ కొబ్బరి విషయంలో ప్రధానంగా యింకొకటి ఆలోచించాలి కొబ్బరి తోటలు నాటిన తరువాత 5 సం॥ ల మొదలు 8 సం॥ ల వరకు కాపు పట్టవు తోట నాటిన సంవత్సరం లగాయతు ఈ పన్ను వేస్తే, ఆ తోటలు వేసేవారిని ప్రోత్సహించుటకు బదులు నిరుత్సాహ పరచుట మవుతుంది. 5 సం॥ ల లోపున కాపురాదు లంకలు, రేవడి గ్రామాలలో 8 సం॥ల వరకు కాపు పట్టవు. అందుకని నాటిన నాటినుంచి యీ పన్ను వేసేపద్ధతి సరైనదికాదు. రెండవ విషయం యీ కొబ్బరిచెట్లు చాలావరకు విడిగా ఉంటాయి కాలవలకు, పోరంబోకులకు చేరిన పొలాలలో వరుసగా యీ చెట్లను వేసేపద్ధతి యున్నది అందుకని యీ చిల్లరచెట్లకు యీ పన్ను వర్తించకుండా ఉండేపద్ధతి ప్రవేశపెట్టకపోతే చాలా చిక్కులు ఉంటాయి. దీనిని నిర్ణయించే అధికారం గ్రామ మునసబు కరణాలకు యిచ్చే పరిస్థితులు చట్టంలో తయారయినాయి, ఆ discretion of power వారు ఉపయోగించేటప్పుడు, అటూ యిటూ అర్థము చెప్పవచ్చును. ప్రాపకం ఉన్న రైతు తప్పించుకుపోయి, ప్రాపకంలేని రైతుమీద యీ భారంపడే అవకాశం ఉన్నది. అందుచేత ముఖ్యంగా యీ రెండు విషయాలు - విడిగా ఉన్న

చెట్లకు exemption యివ్వటం. కాపు పట్టేవరకు తోటపన్ను విధించకుండా ఉండటం-అవసరం ఆదాయం పోతుందనేవాదన అర్థరహితమైనది 10 ఎకరాలకు మించిన తోటలకు ప్రభుత్వం రూ 3 లు average న చూపిస్తే, రు 5 ల వరకు పెంచవచ్చునని నేను చెపుతున్నాను వేలకువేల ఎకరాల కొబ్బరితోటలు గల ప్రాంతంనుంచి రెవిన్యూమంత్రి వెంకటరావుగారు వచ్చారు. వారు అక్కడ ఉన్న practical difficulties ఆలోచించకుండా ఏూకుమ్మడిగా యీ పన్ను వేస్తే అనేక చిక్కులు కలిగే పరిస్థితులు, ఆందోళన కలిగే పరిస్థితులు ఉంటాయనే విషయం దృష్టిలో పెట్టుకొని పరిశీలించాలని, యీ సవరణలు అంగీకరించాలని కోరుతున్నాను

*Sri K L Narasimha Rao* Mr Speaker, Sir I beg to move

"For item 3 of the Schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres. |
|---|---|---|---|---|
| 3 Coconut | Nil | Re 1 | Rs 2 | Rs 3" |

*Mr Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya* Sir, I beg to move

"In item 3 of the Schedule, for the words and figures 'Rs. 3' substitute the words and figures Re 1-50 Np "

*Mr Speaker*. Motion moved

*Sri P Sundarayya* Mr Speaker, Sir, I beg to move

" For item 4 in the Schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres. |
|---|---|---|---|---|
| 4. Tobacco — | | | | |
| (a) Virginia | Nil | Re 1-0-0 | Rs 2-0-0 | Rs. 3-0-0 |
| (b) Other varieties | Nil | Nil | Rs. 0-50 nP. | Re. 1-0-0" |

*Mr. Speaker* Motion moved

*Sri B. Ratnasabhapathi* : Mr Speaker, Sir, I beg to move :

"For item 4 of the Schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—3 acres | 3—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 4 Tobacco — | | | | |
| (a) Virginia | Nil | Re 1-0-0 | Rs 2-0-0 | Rs 3-0-0 |
| (b) Other varieties | Nil | Nil | Re 1-0-0 | Rs 2-0-0" |

*Mr Speaker* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya* Mr Speaker, Sir, I beg to move

"In item 4 (a) of the Schedule for the words and figures 'Rs 3-0-0' substitute the words and figures Rs 1-50 NP

*Mr. Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya* Mr Speaker, Sir, I beg to move

"In item 4 (b) of the Schedule for the words and figures 'Re 1-0-0' substitute the words and figures 'NP 50'"

*Mr. Speaker* . Motion moved

*Sri K L Narasimha Rao* Mr. Speaker, Sir, I beg to move

"For item 4 (b) of the Schedule, substitute the following

(b) Other varieties. After exempting one acre for every cultivator for personal use, Rupee one per acre."

*Mr Speaker* . Motion moved.

*శ్రీ వి విశ్వేశ్వరరావు అధ్యక్షా, ప్రభుత్వం యీ షెడ్యూలులో అన్ని పంటలకు పదిసెంట్ల భూమివరకు పన్ను మినహాయించారు కాని, ఈ పొగాకు మీద ఎంతమాత్రం పన్ను మినహాయించలేదు కేంద్రప్రభుత్వం రైతుల స్వంత ఉపయోగంకోసం కొంతపొగాకుమీద పన్ను వేయకుండ విడిచిపెట్టటం జరిగింది. కాని మన రాష్ట్ర ప్రభుత్వం మొత్తం పొగాకుమీద పన్ను వేయటానికి ప్రయత్నిస్తోంది వర్జినియా పొగాకుమీద పన్ను వేశారు 8 లక్షల 20 వేల ఎకరా

లలో ఇతర రకాల పొగాకు పండుతోందని, ఆ పంటకు ఎకరానికి రూపాయి చొప్పున పన్ను విధిస్తామని అంటున్నారు ఆ ప్రకారంగా చూస్తే, ౩ లక్షల 20 వేల రూపాయలు, యీ పంటవల్ల ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది కాబట్టి ఆ పంటకు పన్ను మినహాయించినా పెద్ద యిబ్బందిరాదు పూర్తి పంటకు కాకపోయినా కొంత పంటకైనా పన్ను మినహాయించవలసిన అవసరం ఉన్నది ఈ ప్రభుత్వం ౩ లక్షల రూపాయలు ఎలా వసూలు చేయాలన్నది ఆలోచిస్తోంది గాని, దీనివల్ల ఎన్నివేలమంది రైతుల కుటుంబాలు నాశనం అయిపోతున్నాయో, ఆలోచించటము లేదు ఈ నాడు పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో చాలా పొగాకు నిల్వ ఉన్నదని, కేంద్రప్రభుత్వానికి కట్టే పన్ను కట్టలేక, అక్కడి రైతులు బాధపడుతున్నారని మనకు తెలుసు రెండు సంవత్సరాలపంట ఆ ప్రాంతాల్లో నిలవ ఉన్నది దానిని పంచేయాలో రైతులకు తోచటంలేదు అటువంటి పరిస్థితుల్లో ఆ రైతు లందరు పన్ను చెల్లించాలని అనటం న్యాయంకాదు ప్రభుత్వం చెప్పిన లెక్కల ప్రకారం చూస్తే, దీనిమీద పన్ను వేస్తే, ౩ లక్షల రూపాయల ఆదాయం వస్తుంది ఈ మూడు లక్షలలో కొంత తగ్గినంతమాత్రాన వచ్చే ప్రమాదం లేదు. కాబట్టి, యీ పన్నును వేయవద్దని చెబుతున్నాను. అలా చేయటానికి వీల్లేదంటే, కనీసం ఆ రైతులు స్వంతానికి, కాల్చుకోటానికి కేంద్రప్రభుత్వం వదలినట్లు, కొంత భాగం వదలిపెట్టాలని కోరుతున్నాను

*Sri P Sundarayya* Mr Speaker, Sir, I beg to move

"For item 5 of the Schednle, substitute the following—

| | Crop. | Below 1 acre. | 1-5 acres | 5-10 acres | Over 10 acres |
|---|---|---|---|---|---|
| 5 | Turmeric | Nil | Rs 2 | Rs 3 | Rs. 5" |

*Mr Speaker* Motion moved

*Sri K. L Narasimha Rao* Mr. Speaker, Sir, I beg to move

"For item 5 of the Schedule, substitute the following—

| | Crop | Below 1 acre | 1—5 acres. | 5—10 acres. | Ovor 10 acres |
|---|---|---|---|---|---|
| 5 | Turmeric | Nil | Rs 1 | Rs 2 | Rs 3" |

*Mr. Speaker* Motion moved

*Sri K. L Narasimha Rao* Mr. Speaker, Sir, I beg to move:

"For item 5 of the Schedule, substitute the following—

5 Turmeric — After exempting one acre for every cultivator for personal use, Rupees three per acre"

*Mr Speaker* Motion moved

*Sri B Ratnasabhapathi* Mr Speaker, Sir, I beg to move

| Crop | Below 1 acre | 1—3 acres | 3—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 5 Turmeric | Nil | Re 1 | Rs 2 | Rs 3 |

*Mr. Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya* Mr Speaker, Sir, I beg to move:

"In item 5 of the Schedule for the words and figures 'Rs 5' substitute the words and figures 'Rs 2'"

*Mr Speaker* Motion moved

* శ్రీ యస్. వేమయ్య (బుచ్చిరెడ్డిపాలెం-రిజర్వుడ్) · అధ్యక్షా, గత సంవత్సరంనుండి, పసుపుధర విపరీతంగా పడిపోయిన సంగతి అందరికీ తెలుసు ధరలు పడిపోయినటువంటి యీ పరిస్థితుల్లో అదనపుపన్ను, పసుపు పండించే రైతులమీద వేయటం సబబుగా లేదని ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను "ఇవి వ్యాపారపంటలు కాబట్టి, వీటికి ఎక్కువధరలు రావటం కద్దు అటు వంటప్పుడు, అలాంటి పంటలమీద పన్ను వేయటానికి వీల్లేకుండా చేయటం ఏమి సబబు" అని మంత్రిగారు అడగవచ్చు అయితే ఒక విషయం వారిదృష్టికి మీ ద్వారా తీసుకువస్తున్నాను. ఇప్పుడే ఒక క్లాజు పాస్‌చేశాము. "ఎప్పుడైనా అవసరం వస్తే, ఇక్కడున్న షెడ్యూలులో మరికొన్ని పంటలు చేర్చవచ్చును, లేక తొలగించవచ్చును" అన్న విషయంమీద తర్జనభర్జనలు జరిగినవి. మేము చెప్పినదానిని మంత్రిగారు ఒప్పుకోలేదు ఉన్నది ఉన్నట్లుగానే ఆ క్లాజు పాస్ అయింది కాబట్టి, ఇప్పుడు యీ టర్మరిక్‌మీద పన్ను వేయకూడదు ఈ టర్మరిక్‌మీద నిజంగా ఎక్కువఆదాయం వచ్చినరోజున, దానిమీద మనం పన్ను వేసుకోవచ్చును ఆ రోజున ఆ పంటను యీ షెడ్యూల్‌లో చేర్చవచ్చును ఆ విధంగా చేర్చుకోవచ్చుననే సెక్షన్ ఇప్పుడే పాస్‌చేశాము. ఈనాడు ఉన్న ధరలదృష్ట్యా, ఇప్పుడు రైతులు పొందుతున్న నష్టాలు దృష్ట్యా, ఒక ఎకరం

లోపు ఉన్న పంటను మినహాయించాలని మేము పెట్టిన సవరణ సబబుగా ఉన్నది కాబట్టి ఆ సవరణను ఒప్పుకోవాలని మీద్వారా మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, మన భారతదేశంలో పసుపు సహజంగా ప్రతి స్త్రీకి ముత్తయిదువుతనంకు ముందుగా ఇస్తారు అన్ని శుభకార్యములలో, గవరమ్మతీరుగా పసుపుముద్ద నిర్మించుకోవటం జరుగుతుంది కళలకు చెందినటువంటి మన కళా వెంకటరావుగారు ఇటువంటి పసుపుమీదకూడ పన్ను వేశారు అంటే ఆ మూర్తులపైనకూడా పన్ను వేశారు అన్నమాట "పట్టణాలలో పసుపు పూసుకోవటములేదు పల్లెటూళ్ళలో మీరుమాత్రం ఎందుకు పసుపు పూసుకొంటారు ? మీకుకూడా ముత్తయిదుతనం తీసేసి, ముండతనం చేస్తాము" అని చెప్పి, యీ పసుపుమీద పన్ను వేయటం జరుగుతున్నది "పసుపుపంటకు రైతులు ఎంత కష్టపడవలసిఉన్నది, భూమిమీద ఎంత ఎరువువేస్తే, ఎంత నీరు పెడితే, ఎంత పంట పండుతుంది" అన్నది ప్రభుత్వం ఆలోచించి పన్ను వేయాలి ఈ పసుపు విషయంలో ఒక ఎకరంవరకు మాఫీచేయాలి ఒక ఎకరంనుంచి మూడు ఎకరాలవరకు ఉన్నవారిపైన ఎకరానికి ఒక రూపాయి, మూడు ఎకరాలనుంచి 5 ఎకరాలు ఉన్నవారిపైన ఎకరానికి రెండురూపాయలు, ఐదు ఎకరాలపైన ఉన్నవారిపై ఎకరానికి మూడురూపాయలు చొప్పున పన్ను విధించాలని చెబుతున్నాను మంత్రిగారు గవరమ్మపైన, దేవుళ్ళపైన దయతలచి ఇంతవరకైనా మాఫీచేస్తారని ఆశిస్తున్నాను

*Sri P Sundarayya* Mr Speaker, Sir I beg to move

"For item 6 of the Schedule, substitute the following —

| | Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|---|
| 6 | Sugarcane (where it is registered area for supplying to Mills) | Nil | Rs 2 | Rs 4 | Rs 8 |
| | Used for Jaggery | Nil | Re 1 | Rs 2 | Rs. 4" |

*Mr Speaker* · Motion moved

*Sri P. Satyanarayana*. Mr. Speaker, Sir I beg to move ·

"For item 6 of the Schedule, substitute the following —

| | Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|---|
| 6 | Sugarcane (Registered for Mills) | Nil | Rs 2 | Rs 4 | Rs 8 |
| | Jaggery | Nil | Re 1 | Rs 2 | Rs 5" |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* Mr Speaker, Sir, I beg to move

"For item 6 of the Schedule, substitute the following —

| | Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|---|
| 6 | Sugarcane (Registered area for Mills) | Nil | Rs 1 50 | Rs 3 | Rs 5 |
| | For Jaggery | Nil | Nil | Rs 2 | Rs 3" |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* Mr Speaker, Sir, I beg to move

'For item 6 of the Schedule, substitute the following —

| | | |
|---|---|---|
| 6 | Sugarcane | After exempting one acre for every cultivator for personal use, Rupees four per acre" |

*Sri B Ratnasabhapathi* Mr. Speaker, Sir, I beg to move

"For item 6 of the Schedule, substitute the following —

| | Crop | Below 1 acre. | 1—3 acres | 3—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|---|
| 6 | Sugarcane | Nil | Re 1 | Rs 3 | Rs 6" |

*Mr. Speaker* · Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya* Mr Speaker, Sir, I beg to move

"In item 6 of the Schedule, for the words and figures 'Rs 5', substitute the words and figures 'Rs. 3'"

*Mr Speaker* Motion moved

*శ్రీ పి సత్యనారాయణ అధ్యక్షా, చెరకు విషయంలో రెండు ప్రధానమైన అంశాలు ఉన్నాయి చెరకు బెల్లంచేసే రైతుకు, పంచదారకు చెరకును మిల్లుకు తోలే రైతుకు ఆదాయంలో చాలా ఎక్కువ వ్యత్యాసం ఉన్నది చిన్న వ్యత్యాసమైతే, మేము ఇంత పట్టుపట్టము ఆ విషయం తూర్పుగోదావరి జిల్లానుంచి వచ్చిన రెవిన్యూమంత్రిగారికి తెలియనటువంటిది కాదు ఇండియా మొత్తంమీద ఒక పాలసీ ఏర్పరచి, ధరవరులలో ఎగుడుదిగుడు స్వభావం లేకుండా, గ్యారంటీడ్ ఇన్‌కం ఉండేటట్లుగా ఒక శాసన సహాయం షుగర్ చెరకు పండించే రైతుకు ఉన్నది కాని బెల్లం చెరకు పండించే రైతుకు అటువంటి అవకాశం లేదు అతడు మార్కెట్‌లో దారుణమైన హెచ్చుతగ్గులతో ఉండు ధరలపైన ఆధారపడి ఉంటాడు అందుచేత మిల్లుకు తోలే చెరకు పండించు రైతుపైన వేసే రేటు బెల్లం చెరకు పండించు రైతుపైన కూడ వేయటం ఎంతమాత్రం న్యాయం కాదు

ఇతర పంటలతో పోల్చిచూసినపుడు, మిల్లుకుతోలే చెరకుకు ఎక్కువ ఆదాయం వస్తుంది ఎక్కువ ఎకరాల్లో యీ చెరుకు వేసినప్పుడు, ఇంకా ఎక్కువ ఆదాయం వస్తూ ఉంటుంది దీంట్లో మార్జినల్ ఇన్‌కం ఎక్కువగా ఉంటూఉంటుంది మిల్లుకుతోలే చెరకుపైన గ్రేడెడ్ టాక్సేషన్ ప్రిన్సిపుల్ ప్రకారం పన్ను వేయాలి ఒక ఎకరం ఉన్నవాళ్ళను మినహాయించటం, పది ఎకరాలకు పైన ఉన్నవారిపై ఎక్కువ రేటు వేయటం, అన్న సిద్ధాంతాన్ని తప్పకుండా అమలు జరపాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

అరటితోటల వ్యవహారంలోకూడ, ఇప్పుడు ఉన్న పేట్రన్ ఆఫ్ హోల్డింగ్ చూస్తే, అరఎకరం, ఎకరం తోట ఉన్నవాళ్ళే చాలామంది ఉన్నారు పది ఎకరాలు, ౫ ఎకరాలు కలిగి, వ్యాపారం చేస్తున్నవారుకూడ కొందరున్నారు సాధారణంగా పట్టణాలకు సమీపంగానే యీ పంటలు హెచ్చుగా ఉండటం కద్దు అందువల్ల చిన్నవాళ్ళమీద పన్ను మినహాయించి, పెద్దవాళ్ళమీద హెచ్చు రేటు పన్ను వేయాలి గ్రేడెడ్ టాక్సేషన్ ప్రిన్సిపుల్ ప్రకారం పన్నులు వేస్తే కొంత న్యాయం జరుగుతుంది. లేకపోతే చిన్నవాళ్ళకు చాలా అన్యాయం జరుగుతుందని మా అభిప్రాయము

*Sri P. Sundarayya* Mr. Speaker, Sir, I beg to move ·

"For item 7 of the Schedule, substitute the following

| Crop | Below ½ acre | ½—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 7 Plantains | Nil | Rs 2-0-0 | Rs 5-0-0 | Rs 8-0-0" |

*Mr Speaker* Motion moved

*Sri P Satyanarayana* Mr Speaker, Sir, I beg to move

"For item 7 of the Schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 7 Plantains | Re 1-0 0 (Below 50 cents Nil) | Rs 2-0-0 | Rs 5-0-0 | Rs 8-0-0" |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* Mr Speaker, Sir, I beg to move

" For item 7 of the Schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 7 Plantains | 50 nP | Rs 2-0-0 | Rs 4-0-0 | Rs 5-0-0" |

*Mr. Speaker* Motion moved

*Sri M Satyanarayana Raju* Mr Speaker, Sir, I beg to move

"For item 7 of the Schedule, substitute the following—

| Crop | Below 1 acre | 1—3 acres | 3—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 7. Plantains | Re 1-0-0 (Below 50 cents Nil | Rs 2-0-0 | Rs. 4-0-0 | Rs 8-0-0" |

*Mr. Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya :* Sir, I beg to move

" In item 7 of the Schedule for the words and figures 'Rs. 5' substitute the words and figures 'Rs 3' "

*Mr. Speaker* : Motion moved.

* శ్రీ యం సత్యనారాయణరాజు అధ్యక్షా, అరటితోట అన్నది గాలిలో దీపం లాంటిది ఏమాత్రం గాలివీచినా పంట దెబ్బతింటుంది అరటితోటకు ముఖ్యంగా కావలసింది నీరు, ఈ నీటిపైన ఎట్లాగు పన్నుఉంది మనం ఎడిషనల్ వెట్ ఎసెస్‌మెంట్ టాక్స్ వేశాము దానిపైన సర్ఛార్జి వేశాము ఈవిధంగా ఇప్పటికే పన్నులభారం జాస్తిఅయింది అసలు యీ అరటిపంట విషయంలో రైతులు చాలా కష్టపడవలసి ఉంటుంది ఇవాళ ఎట్లాగూ ఎడిషనల్ వెట్ ఎసెస్‌మెంట్ ఉంది కాబట్టి యీ అరటిపంటపైన పన్ను వేయవద్దని మంత్రి గారిని కోరుతున్నాను

*Sri P Sundarayya* Mr Speaker, Sir, I beg to move

"For item 8 of the Schedule, substitute the following—

| | Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres. |
|---|---|---|---|---|---|
| 8 | Chillies | Nil | Re 1 | Rs 2 | Rs 4" |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* Mr Speaker, Sir I beg to move

"For item 8 of the Schedule, substitute the following—

| | Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|---|
| 8 | Chillies | Nil | 50 nP | Re 1 | Rs 2" |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* Mr Speaker, I beg to move

"For item 8 of the Schedule, substitute the following—

| | | |
|---|---|---|
| 8 | Chillies | After exempting one acre for every cultivator for personal use, Rupees two per acre " |

*Mr Speaker* · Motion moved.

*Sri P Narasing Rao* Mr Speaker, Sir, I beg to move

"For item 8 of the Schedule, substitute the following—

| | Crop | Below 1 acre | 1—3 acres | 3—5 acres. | Over 5 acres. |
|---|---|---|---|---|---|
| 8 | Chillies | Nil | Re 1 | Rs 2 | Rs. 4" |

*Mr Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya* Mr. Speaker, Sir, I beg to move

"In item 8 of the Schedule, for the words and figures 'Rs 3', substitute the words and figures 'Re 1'

*Mr Speaker* Motion moved

* శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, మిర్చి గుంటూరు జిల్లాలో హెచ్చుగా పండిస్తారు ఆ పంటపండించే రైతులు పడుతున్నబాధ ఆలోచిస్తే, నాకు అడిదం సూరకవి పద్యం జ్ఞాపకం వస్తోంది "ఎండినయూళ్ళ గోడెరిగింప డొక్కడు, పండినయూళ్ళను ప్రభువులంత"— అన్నమాదిరిగా, పండినదానిమీద పన్ను వసూలు చేద్దామని ఉద్దేశమే గాని, పండని ఊళ్ళసంగతి ఆలోచించటం లేదు ఇప్పుడు పంటపండింది కాని అమ్మకానికి అవకాశం లేదు ఆ పంటకు ధరలు వచ్చేందుకు ప్రభుత్వం పూనుకొని, అప్పుడు ఆ రైతులపై టాక్స్ వేస్తే, న్యాయంగా ఉంటుంది వాళ్ళమీద టాక్స్ వేయదలచుకొన్నప్పుడు, మొదట వారు పండించిన పంటకు తగినధర వచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నించాలి క్రిందటి సంవత్సరం ఒకసారి 440 రు వరకు మెరపకు ధరవచ్చింది కాని, వెంటనే వారం రోజుల్లో 150 రు లకు ధర దిగిపోయింది ప్రభుత్వం ఒక మినిమమ్ రేట్ నిర్ణయించాలి ఆదేవిధంగా మేక్సిమమ్ రేట్ నిర్ణయించినా నాకు అభ్యంతరంలేదు రైతులు పంటపండిస్తున్నారు. ఆ పంట తీసుకొనిపోయి గుంటూరు మార్కెట్‌లో ఇస్తారు అక్కడ వాళ్ళకు మార్కెట్ పర్మిట్స్‌లేవు వారుపోయి, మద్రాస్‌లో ఉన్న వ్యాపారస్తులను బ్రతిమాలుకోవాలి వాళ్ళకు ఇతర దేశాలకు పంపించటానికి పర్మిట్స్ ఇస్తున్నారు. కాని ఆంధ్రదేశంలోని వ్యాపారస్థులు మాత్రం విదేశాలకు వీటిని పంపించటానికి పర్మిట్స్ రాలేదు ఆ విషయంలో సెంట్రల్ గవర్నమెంట్ వైఖరి అలాగే ఉన్నది దీనివల్ల పంటలో నష్టంవస్తోంది పంటలకు తెగులు వస్తోంది ఆ తెగులుతో, ఒక్కొక్కసారి, పంటఅంతా ఎటూ కొరకాకుండా పోతోంది దానికి తగినమందు ఇంతవరకు ఎగ్రికల్చరల్ డిపార్టుమెంట్ కనుక్కోలేదు. ఏదోమందు ఇస్తున్నారు ఆ మందు వేస్తే నయమవుతుంది అంటున్నారు కాని ఆ జబ్బు నయమవటంలేదు, పంట మాత్రం పోతోంది

ఎగుమతి విషయము వచ్చేటప్పటికి permits కు అడ్డువస్తున్నది అందువల్ల యివి రెండు కూడ గ్యారంటీచేసే విధానము ఆలోచించిన తరువాత దీనిమీద పన్ను వేయడము న్యాయముగ వుంటుంది అసలు పన్నేలేకుండ మినహాయిస్తే మరీ మంచిదనుకోండి లేకపోతే కొంతైనా తగ్గించడము అవసరము అని అభిప్రాయపడుతూ, మంత్రిగారు ఈ విషయము ఆలోచిస్తారని ఆశిస్తూ సవరణ ఇచ్చాను

* శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, తెలంగాణాలో సామాన్య రైతుకు మిర్చియే ముఖ్యమైన పంట ఇక్కడ తెలంగాణాలో ప్రజలు చాలామంది మిరపకాయల తొక్కు తప్ప వేరే ఏదీ తినరు ఇలాంటి పైరును commercial crop అనడము ఏవిధముగాను సమంజసముకాదు

ఈ మిర్చి విషయములో పదిసెంట్ల వరకు exemption ఇస్తున్నారు కాని ఇక్కడ ఏదిసెంట్లు అంటే 2½ కుంట అవుతుంది ఈ మిర్చిఅనేది సాధారణముగ ప్రతివాడు ఇంటి వెనక దొడ్లోనో, లేక ప్రత్యేకంగా ఉంచుకున్న పెరడులోనో ఎక్కడ వీలుగా ఉంటే అక్కడ వేసుకున్నా గూడ ఈ 2½ కుంట కంటే ఎక్కువగ వేస్తే, దానిమీద పన్ను పడుతున్నది దీనికి ధర ప్రతిసంవత్సరము vary అవుతూ ఉంటుంది ఒక్కొక్క సంవత్సరములో మణుగు ఒకటికి 20 రూ లు, 30 రూ లు ఉంటుంది ఒక్కొకసారి అది నూరు రూపాయలవరకు పెరిగిపోతుంది అందువల్ల ఇది ధర నిలకడలేనటువంటి పంట ఒక్కొక్క ఎకరమునకు 3 రూపాయలు పన్ను వేస్తున్నారు గనుక, ఒకఎకరం వరకైనా exemption ఇవ్వడము న్యాయము ప్రతివారు కూడ అర ఎకరమో, పాతిక ఎకరమో వీలుఅయినంతవరకు మిరపతోటలు పెట్టుకుంటారు తన యింటికి సరిపోయేటంతవరకైనా పెట్టుకోవాలి అంటే, సామాన్యముగ ఒక ఎకరము అయినా ఉండాలి 2½ కుంటలు దాటితే పన్ను వేయడము జరుగుతున్నది ఇప్పుడు ప్రభుత్వమువారు వేసే ఈ వాణిజ్యపు పన్ను కాకుండా, వేరే Sales Tax అని, Octroi duty అని, ఈమాదిరిగ పన్నులు ఇచ్చుకోవలసివస్తుంది కాబట్టి కనీసము ఈ exemption అనేది ఒక ఎకరమునకైనా యిస్తే న్యాయముగ ఉంటుంది ఈ chillies అనేది ఆహారవస్తువు దీనిని తిననివారు ఎవ్వరూ ఉండరు. ప్రతివారు వాడుకునే వస్తువే. కొంతమంది భాగ్యవంతులు చాలా తక్కువగ వాడుతారు ఇంకా పెద్దవారు బొత్తుగా వాడనేవాడరు కాబట్టి ఇది సామాన్య కుటుంబముల వాళ్ళు, పేదవాళ్లతో సహా వాడుకునే వస్తువు గనుక, అందులో ముఖ్యంగా ఆహారమునకు ఉపయోగించుకునే వస్తువు గనుక, ఒక్క ఎకరమునకు అయినా exemption యివ్వాలని కోరుతున్నాను ఒక ఎకరంనుంచి మూడు ఎకరాల వరకు ఒక రూపాయి పన్ను వేయడము సమంజసము 3 ఎకరాల నుంచి 5 ఎకరాల వరకు రెండు రూపాయల పన్ను, అయిదు ఎకరాలపైన నాలుగు రూపాయలు అని ఈ విధముగ graded గా tax వేయడమున్యాయము ఆ విధముగ వేస్తే ఎవ్వరికిగూడ అభ్యంతరము ఉండదు కాబట్టి ఒక్క ఎకరానికి exemption యివ్వాలని మంత్రిగారిని కోరుతున్నాను

*శ్రీ యం. నాగిరెడ్డి అధ్యక్షా, ముఖ్యముగ ఈ మిర్చి పంట విషయము ఇప్పుడు మన గోపాల కృష్ణయ్యగారు చెప్పారు ఈ పంట నిలకడగ వస్తుందన్న నమ్మకము ఉండదు పండితే అదృష్టము అని రైతు సంతోషించవలసిన పరిస్థితి ఉంటుంది. దీనికి ముఖ్యంగా రోగము రావడము కూడ సంభవిస్తూ ఉంటుంది, మిరప చెట్లకు ముడత రోగము అని, ఎర్రగుమ్మడి రోగము అని— ఈ విధముగ అనేక రకాల రోగములు వచ్చి పంటలు పాడైపోవడము ఉంటుంది ఈ రోగాలు రాకుండా prevent చేయటానికి మన Agriculture Department వారి వైపునుంచి గూడ ఏ విధముగాను సహాయములేదు మాగాణి ప్రాంతాలుగా ఉన్న Delta area లో అంతగా ఉపయోగించక పోవచ్చునేమో కాని, మా మెట్ట ప్రాంతాలలో అన్నింటిలోనికి మిరపకాయ లేనిదే భోజనము చేయడ మనేదే ఉండదు మాగాణి ప్రాంతాలవారు మిరపకాయలు లేకపోతే ఏ పులుసో కాచుకుని త్రాగుతారు ఇక మా ప్రాంతాలకు పోతే అక్కడ వాళ్ళు జొన్న అన్నము, సజ్జ అన్నము, కొర్ర అన్నము ఎక్కువగ తింటారు అందులో వాళ్ళు బాగా అలవాటు పడినవాళ్ళు ఈ అన్నమునకు మిరప కాయలు లేకపోతే సాగదు. ప్రతి కుటుంబము తమ అవసరానికి ఒక మణుగో, రెండు మణుగులో పండు మిరపకాయలతో పచ్చడి పెట్టుకుని సంవత్సరము పొడుగునా అదే అన్నములోనికి వాడుకుంటూ ఉంటారు తరువాత చింతకాయ పచ్చడి, గోంగూరపచ్చడి ఇలాంటివి సంవత్సరము అంతటికి ఉపయోగించుకోటానికి store చేసుకుంటారు వీటి రెండింటిలోకి మిరప కాయలు లేనిదే వీలులేదు ఇవి అన్నీ మా అనుభవంలో చూస్తూనే ఉన్నాము కేవలము ఒక్క గోంగూర పచ్చడికే ఒక మణుగో, అంతకు పైగానో కావలసి ఉంటుంది అందులో ముఖ్యంగా పాలేర్లను పెట్టుకుని వ్యవసాయము చేసుకునే వారికి ఈ పచ్చళ్ళు ఉండి తీరాలి వేరే వరి భోజనము ఉండదు గనుక ఈ పచ్చళ్ళనే ఎక్కువగా ఉపయోగిస్తారు.

*శ్రీ కె. వెంకట్రావు : అనుభవములో చూడడముకాదు ఇది wrong fact అనుభవములో తినేవే. ఇది practical experience ను బట్టే చెబుతున్నారు.

శ్రీ యం నాగిరెడ్డి అదేనండి అనుభవమునుబట్టి చూచేవి, తినేవి అని గూడ చెబుతున్నాను మిర్చితోట అనేది సామాన్య కుటుంబమునకు 5, 6 ఎకరాలు ఉంటే, అందులో అతని కుటుంబానికి అయ్యే మిరపకాయల ఖర్చు, ఏ పది మణుగులవరకో గూడ పడుతుంది అందులో అతిశయోక్తి ఏమీలేదు. వ్యవసాయము చేసుకునేవారు, పాలేర్లకు భోజనము మూడు పూటలు

పెట్టి చేయించుకుంటూ ఉంటారు వ్యవసాయము చేసేవారియొక్క అనుభవమును అడిగితే, తెలుస్తుంది మంత్రి తిమ్మారెడ్డిగారు వ్యవసాయమును గురించి తెలిసినవారే, వారి ప్రాంతాలవారు వ్యవసాయము చేసేవారు ఉంటారు గదా! పాలేర్లను పెట్టకుని వ్యవసాయము చేసేవాళ్ళ ఖర్చు ఎంత ఉంటుందో, అడిగితే తెలుస్తుంది అందువల్ల సాధారణముగ ఒక్క ఎకరములో మహాబాగా పండితే, పది మణుగుల మొదలు 20 మణుగుల దాకా పండవచ్చు, అది వాళ్ళ యింటి ఖర్చుకే సరిపోతుంది కాబట్టి ఈ విషయము లన్నీ దృష్టిలో పెట్టుకునే మేము ఒక్క ఎకరమువరకు exemption కావాలని కోరుతున్నది ఒక్కొక్కప్పుడు పంట దెబ్బతిని కాయలు తెల్లగా అయిపోతవి, వీటిని తెల్ల మెరపకాయలు అంటాము ఇవి మేము ఏదో కనిపెట్టుకునిఉన్న పేదవాళ్ళకు, హరిజనులు వగైరాలు, అప్పుడప్పుడు ఏదైనా పనివుంటే వచ్చిచేస్తూఉంటారని ఉచితముగాకూడ పెట్టడము కద్దు ఒక్కొక్కప్పుడు పంటకు తెగులుపడి, మిర్చి చెడిపోతే, ఇక పల్లెటూరునుంచి పట్టణమునకు మార్కెటుకు తీసుకునిపోతే, అవి కొనని పరిస్థితులుకూడ ఉంటూ ఉంటాయి ఎందుకంటె, కాయబాగాలేదని కొనరు, ధరపెట్టరు ఇంతదూరము తీసుకుని వెళ్ళినందుకు అయ్యేఖర్చులు కూడ గిట్టని పరిస్థితులు ఉంటూ ఉంటవి అందువల్ల ఒక్క ఎకరమునకైనా exemption ఇవ్వడము న్యాయము Personal consumption క్రింద కేంద్ర ప్రభుత్వము పొగాకు విషయములో నాలుగు మణుగుల వరకు exemption ఇస్తున్నది అలాంటిది మన ప్రభుత్వము ఏ exemption కూడ ఇస్తున్నట్లు కన్పించదు personal గా వాడుకోటానికి home consumption క్రిందనైనా exemption ఇవ్వకపోతే అసలు తిండే తినవద్దు, మాకు పన్నుమాత్రము కట్టండి అనేపరిస్థితికి ప్రభుత్వము వస్తున్నట్లుగా ఉన్నది అందువల్ల personal—home consumption క్రిందనైనా ఒక ఎకరము exempt చేయడము న్యాయము, ధర్మము గనుక మంత్రిగారిని ఈ సవరణకు ఒప్పుకోవలసిందిగా కోరుతున్నాను

*Sri P Sundarayya* I beg to move

"For item 9 of the schedule, substitute the following—

| Crop. | Below ½ acre | ½-5 acres | Over 5 acres |
|---|---|---|---|
| 9. Citrus Fruit | Nil | Rs 2 | Rs. 5 |

*Mr. Speaker* Motion moved.

*Sri G Yellamanda Reddi* I beg to move.

"For item 9 of schedule, substitute the following

| Crop | Below 1 acre | 1—5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 9 Citrus Fruits | Re 1 (Below 50 cents nil) | Rs 2 | Rs 5 | Rs 8 |

*Mr Speaker* Motion moved

*Sri B Ratnasabhapathi* I beg to move

"For item 9 of the schedule, substitute the following—

| Crop | Below 1 acre | 1—3 acres | 4—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|
| 9 Citrus Fruit | Re 1 (Below 50 cents nil) | Rs 2 | Rs 4 | Rs 8 |

*Mr Speaker* Motion moved

*శ్రీ బి రత్నసభాపతి అధ్యక్షా, నిమ్మ, నారింజ, చీనీనారింజ వగైరాలకు సంబంధించినతవరకు Taxation సిద్ధాంతాలను గురించి మాట్లాడే టట్లయితే మంత్రిగారికి దయవస్తుందనుకుంటాను ఈ Citrus Industry ని గురించి tax ను నిర్ణయించే రేట్లు, మంత్రిగారికిగాని, Department కు గాని తెలిసినట్లుగా నాకు గోచరించడము లేదు మొట్టమొదట తోటలు పెంచడమనేది మన ఆంధ్ర ప్రదేశ్ లో ఎక్కువగ మా కడపజిల్లాలో కోడూరు ప్రాంతాలలో ఆరంభించారు. తరువాత అది కర్నూలుజిల్లాలో పాణ్యములో తీసుక ఎక్కువ వృద్ధిలోనికి రాబడింది తరువాత దేశవ్యాప్తమై రాజమండ్రి, కడియము ఆ ప్రాంతాలకు పోయింది తరువాత దక్షిణాదికి వ్యాపించిపోయింది ఏమైనప్పటికినీ, ముందుగా కడపజిల్లాలో కోడూరులోనూ, రాజంపేటలోను ఎక్కువగ శ్రద్ధతీసుకొని ఈ తోటలను వృద్ధిచేశారు ఆ ప్రాంతాలనుంచి వచ్చిన సభ్యులందరుకూడ దీనిని గురించి మాట్లాడారనుకుంటాను ప్రత్యేకించి ఒక రాజంపేట తాలూకాకు సంబంధించినంతమట్టుకు ఈ నిమ్మ తోటలను పెంచడము ఎక్కువగా ఉన్నమాట నిజమే ఆదాయముకూడ ఎక్కువగానే మొదట్లో వస్తున్నది. ఆదాయము ఎక్కువగ వస్తున్నదని ప్రతివాడు యీ తోటలు వేసి పెంచటానికి ఆరంభించాడు గత ప్రపంచ యుద్ధ సమయములో చాలా పెద్దపెద్ద ధరకూడ పలికింది దానివల్ల ఆదాయముకూడ నిలకడగ వస్తూవున్నదనే ఉద్దేశ్యముతోనే ప్రతిరైతు తనకు ఎకరము ఉన్నా, అర ఎకరము ఉన్నా అందులో సగములో ఈ చీనీతోట, నిమ్మతోట పెట్టుకొని జీవించేవాడు కాని యుద్ధము ముగిసిన తరువాత, నిమ్మకాయలకు, నారింజలకు డిమాండు తగ్గింది. దానితోపాటు

ధరలు రాలేదు దానివల్ల క్రమేణ తోటలుకూడ తగ్గిపోయినవి ఎక్కడో ఎవరో పెద్దపెద్ద సాహుకార్లు బాగా భూమి ఉన్నవారు, ఈ తోటలు పెంచడము ఉంటున్నదే గాని, సామాన్యరైతు కొంత తగ్గించాడు 1945-1946వ సంవత్సరము తరువాతనుంచి ధరలు పూర్తిగ పడిపోయినవి అందుచే దానికి మార్కెటింగు సౌకర్యాలు లేకపోవడము, జరిగింది కాబట్టే, ఎకరము, అర ఎకరము నిమ్మ, నారింజతోట పెట్టుకున్నవాడికి ఈ రోజులలో ఫలితము ఎక్కువ లేకపోవడము, దానివల్ల ఆదాయము రాకపోవడము జరుగుతున్నది 1945 నుంచి ఇప్పటివరకు చిన్నచిన్నవారు ఎవరైనా యీ తోటలు కొద్దిపాటి భూమిలో పెట్టుకుంటే, అది unremunerative గా ఉన్నదని, తోటలు యిక మీదట ఎక్కువ చేయకుండ వున్నవే కొట్టివేసి వేరే పైర్లు పెట్టుకుంటున్నారు దీనియొక్క నిజానిజములు మంత్రిగారు క్రమఅని అనుకోకుండా statistics తెప్పిస్తే, తప్పక తెలుస్తుంది మా కడపజిల్లాలో ఏ యాభై సెంట్లలో తోట వేసుకున్నవారు దానిమీద ఖర్చుచేసి, ఫలితము తినేశక్తి లేకుండా కూర్చున్నారు. Marketing facilities ఉన్నవా అంటే, లేవు ధరచూద్దామా అంటే, అంతకంటే లేదు ఇలాంటి పరిస్థితులలో రైతుకు ఏవిధముగ లాభము వస్తుందని మంత్రిగారు పన్ను వేయదలచుకున్నారో తెలియడములేదు ఎక్కడైనా ఏ చిన్నరైతు అనేవాడు తోట పెట్టుకుంటే అతడు కాసిన కొద్దికాయలు అయినను మార్కెటుకు తీసుకునిపోలేక మధ్యవ్యాపారస్థులకు, కమిషను ఏజంట్లకు అప్పజెప్పుకుంటున్నాడు వారు మధ్యలాభాలుకొట్టి దోపిడి చేస్తున్నారేగాని, పండించేరైతుకు నష్టమేనని చెప్పక తప్పదు ఏదైనా నిమ్మతోటలు పట్టణము దగ్గరలో వేసుకున్నవారు ఉంటే, అవి లోకల్‌గా ఆ పట్టణము మార్కెటులోనే అమ్ముడుపోయే పరిస్థితులు ఉన్నవి కాని చీనీ నారింజలకు సంబంధించినంతమటుకు, south లో ఏ మద్రాసులోనో, మధుర, తిరుచునాపల్లి, వగైరా ప్రదేశములలోనో తప్పితే, వేరేచోట్లలో మార్కెటుచేసి అమ్మటానికి అవకాశములు లేవు. ఇలాటి పరిస్థితులుంటున్నా ఎకరము, అర ఎకరము తోటలు వేసుకున్నవాళ్ళకు మార్కెటు సౌకర్యాలు లేకపోవడముచేత లాభమేలేదు. కనుక ఈ చిన్నచిన్న తోటలు వేసుకున్నవారికి ప్రత్యేకత చూపించాలని మనవిచేస్తున్నాను వాళ్ళు ఎంతో కష్టపడుతున్నారు ఖర్చులు చేయక తప్పడములేదు కాని ఫలితమునకు తగినధర రావటానికి మార్కెటింగు సౌకర్యాలులేక, గిట్టుబాటు కావడములేదు గనుక, వాళ్ళు నష్టపడుతున్నారు గనుక, దయయుంచి వాళ్ళవిషయములో మంత్రిగారు కొంతవరకు సానుభూతితో పునరాలోచించి, ఏదో అన్నింటివిషయములలో సమాధానము చెప్పినట్లుగా, దీనికిగూడ సమాధానము చెప్పకుండా

దీనికి ఒక ప్రత్యేకత చూపించవలసి ఉన్నది ఈ విషయములో చిన్నచిన్నవారి కష్టములు మన Agricultural Minister గారికి కూడ తెలుసును. వారి జిల్లాలోను, వారి ప్రాంతాలలోను చీనీతోటలు ఉన్నవి అక్కడ వాటికి marketting facilities కలుగజేస్తూ ఈ oranges కు ఎక్కువగ ధరలు వచ్చేటట్లుగా కృషిచేస్తున్నారని వింటున్నాము ప్రజలకుగూడ పండ్లనే ఎక్కువగ ఉపయోగించే అలవాటు చేసుకోటానికి మార్గములనుగూడ ఆలోచిస్తున్నారని తెలుస్తున్నది ఈ Citrus Industry కి గాని చీనీ oranges కు దేశము మొత్తము మీద దక్షిణాదిన తప్ప మరెక్కడకూడ మార్కెట్ లేదు ధరలు ఎక్కువగ వచ్చి వారికి ఆదాయము వచ్చేటట్లుగా చేస్తే, అప్పుడు యిలాంటిపన్నులు వేసినను పరవాలేదు దానికి ప్రస్తుతము encouragement లేకుండా పోతున్నది ఈ industry ప్రజల ఆరోగ్యానికి ఉపయోగించేది గనుక, మంత్రిగారు యీ విషయం కొంతవరకు పునరాలోచించి కనీసం 50 cents వరకైనా exemption ఇవ్వాలని కోరుతున్నాను అదిగాక ఈ Citrus Industry అనేది ఒక ప్రత్యేకమైన industry ప్రస్తుతము ఇది చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నది దీనికి మంచి marketting facility ఒక్క America దేశములో తప్ప మరెక్కడకూడ లేదనుకుంటాను అక్కడ ప్రభుత్వం దీనికిప్రోత్సాహము ఇస్తున్నారు ఒక్కొక్కచెట్టుకు మంచిఫలితము ఉండేటట్లయితే, రెండువేలు, మూడువేల రూపాయలు కూడ ఖర్చుచేయడము ఉన్నది అలాంటి ప్రాంతాలు మనదేశములో లేవు ఐనను మనదేశములో కూడ దీనిని ప్రభుత్వము ప్రోత్సహించటానికి వీలులేకపోయినప్పటికినీ, కనీసము అర ఎకరము వరకైనా exempt చేస్తే మంచిదని మంత్రిగారు దానికి ఒప్పుకుంటారని ఆశిస్తున్నాను.

*శ్రీ యన్. వెంకయ్య (అద్దంకి) : అధ్యక్షా, ప్రజల జీవితావసర వస్తువులకు ధరలు తగ్గించాలని, అందుకు subsidy కూడ యివ్వాలని ప్రభుత్వము దృష్టిలో ఉన్నది. subsidy ఇవ్వటానికి వీలు లేకపోయినప్పటికినీ నిత్యజీవితావసరవస్తువు అయిన వంటచెరుకుగా ఉపయోగించే సర్వీతోటలు ప్రజలకు ముఖ్యావసరమైనదని అందరికీ తెలుసు అదేవిధముగ మిర్చికూడ జీవితావసర వస్తువే, అలాగే నిమ్మకాయలు, చీనీ నారంజిలు, ఇలాంటివాటికి ఎక్కువగ పన్ను వేయడమువల్ల వీటికిధర పెరిగే అవకాశము తప్పకఉంటుంది. ఇవి ప్రజలకు ఎక్కువగ నిత్యజీవితములో అవసరమైనవి గనుక, వీటికి తగినంత మట్టుకు మినహాయింపు ఇస్తేనే మంచిదని నా అభిప్రాయము మంత్రిగారు ఈ విషయము కొంతవరకు సానుభూతితో పునరాలోచిస్తారని ఆశిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ , సవరణలు నెం 102 మొదలు 106 వరకు వేరుశనగకు సంబంధించినవి ముందు గోపిడి గంగా రెడ్డిగారు దీనినిగురించి మాట్లాడుతారు

*Sri M Nagi Reddi* I beg to move
"Delete item 10 of the Schedule"

*Mr Speaker* Motion moved

*Sri P Sundarayya* I beg to move
"For item 10 of the Schedule, substitute the following

| | Crop | Below 5 acres | 5—10 acres | Over 10 acres |
|---|---|---|---|---|
| 10 | Groundnut | Nil | 0-8-0 | Re 1 |

*Mr Speaker* Motion moved

*Sri K L Narasimha Rao* I beg to move
"For item 10 of the Schedule, substitute the following —
'10 Groundnut — After exempting two acres for every cultivator for personal use, Rupee one per acre' "

*Mr Speaker* Motion moved

*Sri Gopidi Ganga Reddi* I beg to move "
"For item 10 of the Schedule, substitute the following

| | Crop | Below 1 acre | 1—3 acre | 3—5 acres | Over 5 acres |
|---|---|---|---|---|---|
| 10 | Groundnut | Nil | Nil | 0-8-0 | Re 1 |

*Mr. Speaker* Motion moved

*Sri Vavilala Gopalakrishnayya* · I beg to move
"In item 10 of the Schedule for the words and figures, 'Re 1', substitute the words and figures "50 N P."

*Mr. Speaker* Motion moved

* శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, యీ బిల్లులో వేరుశనగను వాణిజ్యపువంటగా చూపించడం జరిగింది ఐతే నా నియోజక వర్గపు ప్రాంతములో వేరుశనగను బీదప్రజలు హెచ్చుగా అహార పదార్థమువలె తింటూ ఉంటారు. ప్రతి బీదరైతుకూడా తన స్వంత ఉపయోగం నిమిత్తం వేసుకొంటూ ఉంటాడు.

కాబట్టి ఒక ఎకరము భూమిలో ఎవరైనా వేయిశనగ వేసుకున్నట్లయితే దానిని మినహాయించవలెనని కోరుతున్నాను 3 ఎకరములకు మించి పంట వేసుకుంటేనే పన్ను విధించాలని నా అభిప్రాయము సాధారణంగా మా ప్రాంతములో చాలా నిస్సారవంతమయిన భూమిలోనే వేరుశనగ వేస్తూ ఉంటారు ఈ భూములలో పండే పంటకూడా చాలా తక్కువగా ఉంటుంది అందువల్ల మూడు ఎకరములవరకూ శిస్తు మాఫీచేయాలని మూడు, ఐదు ఎకరములమధ్య ఎకరానికి 8 అణాల చొప్పున 5 ఎకరముల పైబడ ఎకరానికి రూపాయి చొప్పున పన్ను విధించాలనే నా సవరణను ప్రభుత్వము అంగీకరిస్తారని కోరుతున్నాను

శ్రీ పి. సత్యనారాయణ 107 వ నెంబరుగల నా సవరణ అవసరము లేదని అనుకుంటున్నాను మేము కోరిన మినహాయింపులు పాసైతే షెడ్యూలుకు ఎక్స్ప్లనేషన్ అక్కరలేదు

*Sri M Nagi Reddi* I beg to move

"In Explanation I of the Schedule, after the words 'Coconut' insert the words 'other varieties of tobacco' "

*Mr Speaker* Motion moved

శ్రీ యం. నాగిరెడ్డి: మెట్టప్రాంతాలలో రైతులు తమ ఇండ్ల పెరళ్లలో నాటు పొగాకు స్వంతఉపయోగము నిమిత్తము వేసుకుంటూ ఉంటారు పొగాకు పండీ పండకముందే పచ్చి ఆకునే తెచ్చుకొని కాల్చుకుంటూ ఉంటారు కొందరు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు కూడా దీనిని చూచీ చూడకుండా ఉంటున్నారు రైతులు తమ స్వంత ఉపయోగము నిమిత్తము ఇండ్ల పెరళ్ళలో వేసుకుంటున్నారు ఈ పొగాకును వాణిజ్య పంటగా ఎంచడం సమంజసంకాదు కాబట్టి 10 సెంట్లు వరకు పొగాకు వేసుకున్నా దానిని యీ పన్నునుంచి మినహాయించాలని కోరుతున్నాను.

*Sri Gopidi Ganga Reddi* I beg to move

"In Explanation I of the Schedule, after the word."
'Chillies' insert the words 'tobacco, turmeric'."

*Mr Speaker :* Motion moved.

శ్రీ గోపిడి గంగారెడ్డి అధ్యక్షా, పొగాకు, పసుపు మొదలయినవి 10 సెంట్లు వరకు వేసుకుంటే వాటిని యీ పన్నునుంచి మినహాయించాలని కోరుతున్నాను పసుపు గృహోపకరమైన వస్తువు కనుక స్త్రీలు విస్తారముగా

వాడుకుంటూ ఉంటారు కనుక పసుపును కూడా మినహాయించాలని కోరు తున్నాను

*Sri P Sundarayya* I beg to move

"In Explanation I of the Schedule, after the words 'Citrus Fruit', insert the words 'turmeric, tobacco, plantains or sugarcane' "

*Mr Speaker* Motion moved

*Sri B Ratnasabapathy* I beg to move

"In line 4 of the Explanation of the Schedule, for the words 'ten' substitute the words 'fifty' "

*Mr Speaker* Motion moved

*Sri B Sriramamurthy* I beg to move

"In line 4 of the Explanation of the Schedule, for the words 'ten cents', substitute the words 'one acre' "

*Mr Speaker* Motion moved

*Sri B Sriramamurthy* I beg to move

"Add the following at the end of the Explanation 1 of the Schedule—

'and that in the case of tobacco (other varieties), chillies, cotton and groundnut special assessment shall be levied where the grow exceeds one acre' "

*Mr Speaker* Motion moved

* శ్రీ బి శ్రీరామమూర్తి. ఆదాయము ఎక్కువగా రావలెనంటే పన్నులు ఎక్కువగా వేయడమొక్కటే మార్గమని యీ 20వ శతాబ్దములో కూడా కొందరు భావిస్తూ ఉండడము శోచనీయమైన విషయము. ఈ విషయములో ఏ వర్గము మీద పన్ను వేసి డబ్బు రాబట్టాలి అనేది మనము ఆలోచించవలసియున్నది అరిగిపోయిన చెప్పుల మీద, చినిగిపోయిన చొక్కాల మీద, మాసిపోయిన గడ్డం మీద పన్నులు వేయడము భావ్యమా అనేది ఆలోచించుకోవాలి ఈరోజున మిరపకాయ మీద, ఉప్పుమీద కూడా పన్ను విధిస్తున్నారు ప్రజాసామాన్యము వద్ద నిత్య జీవితావసర వస్తువులపై పన్నులు బనాయించడము చాలా విచారకరముగా ఉంది. కావ్‌స్టైన్

సిగరెట్టు మీద గాని, సర్జ్ కోట్ మీద గాని, బ్యాంకు చెక్కులమీద గాని, పన్ను వేస్తే మేము అర్థము చేసుకోగలము కాని సామాన్య కుటుంబికునికి అనుక్షణము కావలసిన వస్తు దినుసులమీద పన్ను వేయడం న్యాయంకాదు కాబట్టి యీ వాణిజ్య పంటలు అనబడేవి రైతు తన స్వంత ఉపయోగానికి వాడుకునే మేరకు అంటే ఒక ఎకరం వరకూ మినహాయించవలెనని కోరుతున్నాను మైక్ లేకుండా మంత్రులు ఎలా మాట్లాడలేరో, కాఫీ లేకుండా కాలు కదపలేకుండా నాగరికులెలాఉన్నారో అదేవిధంగా పొగపీల్చకుండా ఏ రైతూ పొలానికిపోడు అందువల్ల ఒక యకరము లోపు పంటలను మినహాయించవలెనని నేను ప్రతిపాదించాను ఈ ప్రభుత్వ విధానాన్ని చూ. మిరపకాయ కండ్లు ఎర్ర చేస్తున్నది, ప్రత్తి ప్రేలుతున్నది, వేరుశనగ సిగ్గుతో భూమిలో తలదూర్చుకుంటోంది అని మనవిచేస్తున్నాను,

*Sri P Satyanarayana* I beg to move

"Delete Explanation II of the Schedule"

*Mr Speaker* Motion moved

*Sri P Narasinga Rao* I beg to move

"For the existing Explanation II of the Schedule, substitute the following—

"Explanation II Where cotton is raised on and land mixed with korra or the groundnut is raised on any land mixed with pulses only 3/4th of the area of any such land so cultivated shall be taken into consideration for the purpose of assessment of the tax"

*Mr Speaker* Motion moved

*శ్రీ పి నరసింగరావు అధ్యక్షా, ఈ Explanation లో కొఱ్ఱ, ప్రత్తి కలిపితే 75 నయాపైసలుతీసుకోవాలనివుంది ప్రత్తి, కొఱ్ఱ కలిపి కొన్నిప్రాంతాలలో వేస్తారు తెలంగాణా ప్రాంతములో కంది, వేరుశనగ వేస్తారు 8 సాళ్ళు వేరుశనగ వేస్తే ఒకసాలు కంది వేయడం జరుగుతుంది. ఇక్కడ ప్రతి రైతుకు అలా కలిపివేయడమే అలవాటు అందువల్ల వేరుశెనగ వేస్తే ఆ మేరకే పన్ను తీసికోవటం సమంజసము, కాని వేయని భాగమునకు కూడా తీసికోవటం న్యాయంకాదు కాబట్టి ఈ Explanation లో "groundnut is raised on any land mixed with pulses" అని include చేసి 3/4 area ను calculate చేయాలని నేను ఈ సవరణద్వారా కోరుతున్నాను.

*Sri M Nagi Reddi* I beg to move

"In line 2 of Explanation II of the Schedule, after the words 'mixed with korra' insert the words 'or sajja or cholam' "

"In line 2 of Explanation II of the Schedule, after the words 'proportion of korra' insert the words 'or sajja or cholam' "

*Mr Speaker* Motions moved

*శ్రీ యమ్ నాగిరెడ్డి అధ్యక్షా, రాయలసీమలో ఏవిధంగా కొఱ్ఱ, ప్రత్తి కలిపి పైరు పెడుతూ వుంటారో అట్లాగే గుంటూరు జిల్లాలోను, నెల్లూరు జిల్లాలోని మెట్టప్రాంతములలోను, తెలంగాణాలోను జొన్న అనే ఆహారపదార్థములో 3 పాళ్ళకు ఒకపాలు ప్రత్తికలిపి పండిస్తూ వుంటారు శ్రావణమాసంలో వర్షం లేకపోయినా, మిడుతలవల్ల జొన్నపైరుపోతే, వాటిమధ్య ప్రత్తివేస్తారు. అలాగే సజ్జలోను కలుపుతారు అలా 4 వంతుల భూమిలో 3 వంతులు ఆహార పదార్థమువేసి, ఒకవంతు ప్రత్తివేయటం జరుగుతుంది కొఱ్ఱకి, దీనికి difference లేదు రాయలసీమ సభ్యులను కొద్దిమందిని తృప్తిపరచటానికి ఇది పెట్టారేమో కాని ఆంధ్రప్రదేశ్ మొత్తంగా సజ్జ-ప్రత్తి, కొఱ్ఱ-ప్రత్తి, జొన్న-ప్రత్తి—సాధారణమైనది. కాబట్టి exemption వాటికి ఇవ్వకపోవటం అన్యాయం కనుక మంత్రిగారు వాటినికూడా ఆమోదించాలని కోరుతున్నాను

*Sri K. L Narasimha Rao* I beg to move

"In lines 2 to 3 of Explanation II of the Schedule, delete the words 'and the proportion of korra to cotton so raised is not less than two to one'."

"In line 2 of Explanation II of the Schdule, after the words 'to cotton' insert the words 'kandi or jute to groundnut'.',

"In line 3 of Explanation II of the Schedule, for the words 'two to one' substitute the words 'one to two' "

*Mr. Speaker.* Motions moved.

*శ్రీ కె. ఎల్. నరశింహారావు. అధ్యక్షా, ప్రత్తివిషయంలో నాకు ఎక్కువ అనుభవంలేదు దానినిగురించి నాగిరెడ్డిగారు చెప్పారు ఇక్కడ వేరుశనగ వేసినపుడు దానిలో ఇంకోపంటను కలుపకుండా రైతు ఎప్పుడు సాగు చేయడు. కందిగాని జనుముగాని వేస్తూ వుంటాడు ఆదిలాబాద్‌లో వేరుశనగలో కొఱ్ఱ వేసే సాంప్రదాయంకూడావున్నది. అయినా ఆహారధాన్యాలలో

కలిపివేసేవాటిగురించి రైతుకు కొంత అనుకూలం చేయవలెనని సెలక్టుకమిటీలో చర్చించబడింది. ప్రత్తివిషయం వచ్చినపుడు ప్రత్తి కొఱ్ఱ కలిపితే 75 నయా పైసలు తీసికొంటామని మంత్రిగారు చెప్పారు అలాగే కంది కొఱ్ఱ కలుపుతారు కొఱ్ఱ నాకు తెలియదు కనుక వ్రాయలేదు కంది జ్యూట్ అని వ్రాశారు అవి కలిపివేసినప్పుడు 75 నయాపైసలు కాని లేక ఈ amendment లో వున్నట్లు వారు ఒప్పుకొంటే 50 నయాపైసలుగాని విధించాలని ప్రత్తికి కల్పించిన అవకాశమే వేరుశనగకు కల్పించాలని మంత్రిగారిని కోరుతున్నాను

*Sri K L Narasimha Rao* I beg to move,

"In line 3 of Explanation II of the Schedule for the words 'two to one' substitute the words 'one to two'"

*Mr Speaker* Motion moved.

*శ్రీ కె. ఎల్. నరశింహారావు ఇది పొరపాటుగా ఉన్నట్లున్నది

"Where cotton is raised on any land mixed with korra and the proportion of korra to cotton so raised is not less than two to one" అని ఉంది

కొఱ్ఱ ఒకపాలు, ప్రత్తి రెండుపాళ్ళు అనే అర్థం దీనిలోనే వస్తున్నది. అందువల్ల నేను యీ amendment యిచ్చాను. అది correct కాదని మంత్రిగారు చెబితే ఆ amendment ను wilhdraw చేసుకొనటానికి నాకు ఏమీ అభ్యంతరం లేదు

*Sri Pillalamarri Venkateswarlu*. I beg to move.

'For the existing Schedule, substitute the following—

| | Crop | Exemption. | Rate of special assessment. |
|---|---|---|---|
| 1 | Casuarina | 2 acres | Re. 1 per acre |
| 2. | Cotton | 5 acres | 0.50 naye paise, per acre. |
| 3. | Cocoanut | 10 cents | Rs 2 per acre |
| 4. | Tobacco · | | — |
| | (a) Country variety | 50 cents | 0.50 naye paise, per acre. |
| | (b) Virginia | " | Rs 2 per acre. |
| 5 | Turmeric | 1 acre | Rs. 3 " |
| 6. | Sugarcane | 50 cents | Rs. 3 " |
| 7. | Plantains | 25 cents | Rs. 3 " |
| 8. | Chillies | 50 cents | Rs. 2 " |

| | | | |
|---|---|---|---|
| 9 | Citrus Fruit | 10 cents | Rs 2 per acre |
| 10 | Groundnut | 5 acres | 0 50 naye paise per acre |

*Mr Speaker* Motion moved

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move

"Substitute the following for existing Explanation I—

'Explanation I — In this schedule crop shall mean only when such crop is raised in such a contiguous manner as shown in the schedule in amendment No 127' "

*Mr Speaker* Motion moved

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, ఏ క్రాప్‌కు ఎంత ఎట్లా raise చేసి సర్చార్జి చేయాలో ఒక table తయారుచేసి ఇచ్చారు దానిని మంత్రిగారు accept చేస్తే బాగుంటుంది.

| | Crop | Exemption |
|---|---|---|
| 1 | Casuarina | 2 acres |
| 2 | Cotton | 5 acres |
| 3 | Cocoanut | 10 cents |
| 4 | Tobacco- | |
| | (a) Country variety | 50 cents |
| | (b) Virginia | |
| 5 | Turmeric | 1 acre |
| 6 | Sugarcane | 50 cents |
| 7 | Plantains | 25 cents |
| 8. | Chillies | 50 cents |
| 9. | Citrus Fruit | 10 cents |
| 10. | Groundnut | 5 acres |

వీటిని మినహాయిస్తే వసూలు చేయటానికి వీలుగా ఉంటుంది మంత్రి గారు ఒప్పుకోవాలని కోరుతున్నాను.

* *Sri B Sriramamurthy* I beg to move

"Add the following as Explanation I of the Schedule and renumber the rest—

'Explanation I. In this schedule casuarina, cocoanut and citrus fruit shall be liable for special assessment only after the first six years of their growth'."

*Mr. Speaker*: Motion moved.

శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా! ఈ పంటలు వేసినవెంటనే ఫలితానికి వచ్చేవికావు. Casurina 7, 8 సంవత్సరాలు పెరిగిన తరువాత ఫలితానికి వస్తుంది ఈలోపున రైతుకు ఒక 'పైస' కూడా రాదు అదేవిధంగా coconut, citrus fruit కూడా కాని ప్రభుత్వం తెస్తున్న చట్టములోని Explanation ను చూస్తుంటే మొక్క వేసిన మరుక్షణంనుండి పన్ను చెల్లించుకోవలసి వుంటుంది ఇది సరైన విధానంకాదు ఏరోజు రైతుచేతిలో పైసపడే అవకాశంవున్నదో ఆరోజు పన్ను విధించటం సరైన పద్ధతిగా వుంటుంది అందుచేత 6, 7 సంవత్సరాలు ఐనప్పటికి, రైతుచేతిలో పైసపడే దానికి ఆస్కారం లేకుండా ఉంటున్నప్పుడు ఈ పన్ను వేయటం సరైనదికాదని మంత్రిగారికి మనవిచేస్తూ ఈ సవరణను ప్రతిపాదిస్తున్నాను

*Sri S Vemayya* I beg to move

"Add the following at the end of Explanation I of the Schedule—

'but shall not apply to the landless labourers cultivating not exceeding 25 cents of plots by each individual or persons belonging to the Scheduled Castes, Scheduled Tribes and Backward Classes cultivating one acre and below by each individual on co-operative basis'."

*Mr Speaker* Motion moved.

* శ్రీ యస్. వేమయ్య అధ్యక్షా, ఇది ఒక ప్రత్యేకమైన సవరణ. ఏవిధంగా చూచినా మంత్రిగారు దీనిని తప్పకుండా అంగీకరిస్తారనే నమ్మకం నాకు ఉన్నది అయితే explanation లో 10 సెంట్ల లోపున మినహాయిస్తూ, తోపుగా ఉన్నట్లయితే, దానిని charge చేయవలసిన విధంగా ఉన్నది

అయితే నేనొక విషయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. కేంద్ర ప్రభుత్వం గాని, రాష్ట్ర ప్రభుత్వాలు గాని, కో-ఆపరేటివ్ సొసైటీలను అభివృద్ధిచేయాలనే దృష్టితో వారికి అన్నివిధాలా సహాయంచేస్తూ, కొన్ని మినహాయింపులు యివ్వడం కూడా జరుగుతోంది కాని యిప్పుడు యీ క్లాజులో యిచ్చినదానిని బట్టి, ఎక్కడైనా కో-ఆపరేటివ్ బేసిస్ మీద చేసుకుంటూంటే వారికి ఏమీ మినహాయింపు లేనట్లు కనబడుతోంది ఇంకా co-operative basis మీద కాకుండా, కొంతమంది అక్కడచేరి వేరువేరు plots గా 10 సెంట్లు, 20 సెంట్లు, ఎకరం— యీ రకంగా గట్లు వేసుకొని తోపుగా చేసుకుంటారు. అవి రెవిన్యూ ఎకౌంటులో ప్రత్యేకంగా వ్రాయబడుతున్నాయి. అటువంటివాటికి మినహాయింపు లేకుండా, అవి తోపుగా ఉన్నాయి కాబట్టి charge చేయాలనే

విధానం కనబడుతోంది కాని, individual plots గా ఉండి, వేరువేరుగా 10 సెంట్లు, 20 సెంట్లు co-operative basis మీద చేసుకొనే పేదలకు ఒక ఎకరం వరకూ మినహాయించాలని నేను నా సవరణలో యిచ్చాను కాని మంత్రిగారు ½ ఎకరం అయినా, కనీసం 25 సెంట్లు అయినా ఒప్పుకొంటే co-operative system ను బలపరచిన విధానంగా కనబడుతుంది అది ప్రభుత్వం యొక్క policy గా కనబడుతుంది కాబట్టి యీ సవరణను అంగీకరించాలని కోరుతున్నాను 1, 2, 3 సెంట్లు చేసుకొనేటప్పుడు కూడా ఒక తోపుగా కనబడితే అన్నింటి మీదా charge చేయడం సంభవిస్తోంది అట్లాకాకుండా మంత్రిగారు యీ సవరణను తప్పకుండా అంగీకరించాలని అడుగుతున్నాను అంగీకరించినట్లయితే పేదవారికి సహాయంచేసే ప్రభుత్వ విధానంగా వస్తుంది అటు కో-ఆపరేటివ్ సొసైటీలను అభివృద్ధిచేయడానికి దోహదం యిచ్చినట్లు ఉంటుంది కాబట్టి దీనిని ప్రభుత్వంవారు తప్పకుండా అంగీకరించాలని మీ ద్వారా అడుగుతున్నాను

*శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, ఈ schedule లోని వివిధ items కు దాదాపు 70 సవరణలదాకా వచ్చాయి కొన్ని ముఖ్యమైన విషయాలను మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చి, వాటిని అంగీకరించాలని కోరడానికే నేను ప్రత్యేకంగా మాట్లాడుతున్నాను. అన్ని సవరణలలోనూ gradation పెట్టాలనేది సూత్రప్రాయంగా ఉన్నది అయితే వారు ఆ gradation పెట్టడానికి యిప్పుడు వీలులేదంటున్నారు అదే వారికీ, మాకు మధ్యఉన్న fundamental difference నేను వాటినిగురించి యిప్పుడు అంగీకరించమని చెప్పినా వారు అంగీకరించరు కాని కొన్ని విషయాలను మాత్రం గుర్తించాలని కోరుతున్నాను Gradation పెట్టకుంటేపోనీయండి Cotton, Groundnut యిటువంటి పంటలు చాలా పేదప్రజలు వేస్తారు ఇప్పుడు వాటిమీద ఎటువంటి మినహాయింపు లేదు. ప్రతి సెంటు భూమిమీద commercial crop అనే పేరుతో శిస్తు పడుతోంది. వాటికి మినహాయింపు అవసరమని మేము చెబుతున్నాము ఈ మినహాయింపు అందరికి ఉపయోగకరంగా ఉండేటట్లు 5 ఎకరాలవరకూ మినహాయించాలనేది నా సవరణ కొంతమంది ఒక ఎకరం అయినా సరే మినహాయించాలని కోరారు వీటిని అంగీకరిస్తే తాము పండించినది తమస్వంత ఉపయోగానికి వాడుకుంటే పన్నులు లేకుండా ఉంటుంది. ఇన్ని సవరణలలో కనీసం ఏఒక్కటైనా అంగీకరించాలని నేను కోరుతున్నాను

పొగాకు విషయం తీసుకుంటే దానిమీద excise duties పడుతున్నాయి వర్జీనియా సంగతి విడిచిపెట్టి నాటు పొగాకు విషయంలోనైనా gradation

పెట్టకుంటే పోనీ, మిగిలినవాటికి యిచ్చినరీతిగా ఒక ఎకరం వరకైనా exemption యివ్వాలని కోరుతున్నాను కనీసం 10 సెంట్ల వరకైనా మినహాయించాలని explanation లో కోరినాము Citrus fruit, casuarina, cocoanut వీటన్నింటికీ యిచ్చినరీతిగానే నాటు పొగాకుమీదకూడ కనీసం 10 సెంట్లు అయినా యివ్వడం న్యాయం మేము ఈ ఒక్కదానికి గట్టిగా పట్టుపడుతున్నాం మంత్రిగారు ఆలోచించి ఏ ఒక్కటైనా అంగీకరించడానికి వీలుంటుందనే దృష్టితో మేము యిన్ని సవరణలు తెస్తున్నాము నాటు పొగాకు విషయంలో ఏదో కొంతవరకైనా మినహాయించవలసిన అవసరం ఉన్నది ఇది సామాన్యంగా ప్రతి వ్యక్తి పెరడులోనో, ఎక్కడనో వేసుకొని తను స్వంతంగా ఉపయోగించుకొంటాడు అటువంటి దానిమీద పన్ను వేయడం న్యాయం కాదు కాబట్టి దానిని మినహాయించాలని కోరుతున్నాను

ఇక పసుపు విషయంలో ఒక ఎకరం మినహాయించి, మిగిలిన దాని మీద gradation principle ను బట్టి వేయాలన్నాము ఇంటిలో ఉపయోగించుకోడానికి 10 సెంట్లు వేసుకుంటే అటువంటివి మినహాయించాలని కొన్ని సవరణ లున్నాయి ఈ విషయాన్ని మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను

పొగాకు విషయంలో వర్జీనియాకు, నాటు పొగాకుకూ భేదం చూపించారు ఆ సూత్రాన్నే sugar-cane విషయంలో ఎందుకు వర్తింప జేయకూడదు ? Registred area లో రిజిష్టరు చేయబడి guaranteed supply ఉన్న చోట, మిల్లులు ఆ సరకును తీసుకునేచోట మణుగు 1 కి 1-7-0 చొ॥న ధర ఉండితీరాలి అని నిర్ణయించబడిన ప్రాంతాలలోని రైతులమీద అదనపు పన్నులు వేయడంలో అర్థం ఉన్నది కాని బెల్లానికి అటువంటి guarantee ఏమీ లేదు. ధరలు చాలా ఒడుదుడుకుగా ఉంటాయి. మిల్లులు తీసుకోని చెరుకుగడను jaggery క్రింద మార్చకపోతే అదంతా నిరుపయోగం అయిపోతుంది పంచదార మిల్లులకు సరఫరా చేసే చెరుకు గడమీద ఎంత రేటున పన్ను వేస్తారో అదే రేటున దీనిమీదకూడ వేయడం న్యాయంకాదు. వర్జీనియా, నాటుపొగాకు విషయంలో తేడా చూపించారు. అదేరీతిగా చెరుకుగడ విషయంలో కూడా మిల్లులకు సప్లయిచేసే చెరుకుగడకు, Jaggery తయారుచేసే చెరుకుగడకు తేడా చూపించవలసిన అవసర మున్నది. లేకపోతే వారిమీద అనవసరమైన భారం పడుతుంది బెల్లం తయారుచేసే చెరుకు గడమీద పన్నులు తగ్గించాలని అనేక సవరణలు ఉన్నాయి. అందులో ఏ సవరణను అంగీకరించినా మాకు సంతోషమే.

ఇక మిరప తోటల సంగతి తీసుకుంటే — 10 సెంట్ల వరకు మినహాయించడానికి సెలక్టు కమిటీలో అంగీకరించారు ఇది సాధారణంగా పెరలు వేసుకొనేది ఎక్కువ భూమిలో వేసుకుంటే అది వ్యాపారపంట అన వచ్చును కాని ఇంటిదగ్గర పెరటిలో తన ఖర్చుకోసం, వేసుకుంటె దాని మీద పన్నులు వేయడం న్యాయంకాదు మెట్ట ప్రాంతాలలో మిగిలిన ఆహారపు పంటలు తక్కువగా ఉంటాయి కాబట్టి ఎక్కువగా మిరప తోటలు వేస్తున్నారు కాబట్టి ఒక ఎకరం వరకైనా మినహాయించవలసి ఉంటుంది ఈ నాలుగు విషయాలనూ మంత్రిగారు ఆలోచించాలని కోరు తున్నాను పసుపు, నాటు పుగాకు విషయంలో కనీసం 10 సెంట్లు అయినా మినహాయించాలి చెరకు విషయంలో బెల్లం తయారుచేసే చెరకుకు— మామూలు చెరకుకు భేదం చూపించాలి ఈ నాలుగింటినీ అంగీకరిస్తే, రైతు తన స్వంత ఉపయోగంకోసం వేసుకొనే వాటిపై అదనపు పన్నులుకూడా ఉంటాయి నిత్యావసర వస్తువులపై పన్నులు తగ్గడానికి అవకాశం ఉంటుంది చిన్నరైతులపై భారంలేకుండా ఉంటుంది కాబట్టి మిగిలిన సూత్రాల నన్నింటినీ అంగీకరించినా, అంగీకరించకపోయినా యీ 4 సూత్రాలనూ అంగీకరించాలని కోరుతూ నేను ముగిస్తున్నాను

* శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఈ బిల్లుపై చర్చ పూర్తి అయినది ఏయే పంటలకు యీ బిల్లును వర్తింపజేయాలనే విషయమైకూడా చాలా చర్చ జరిగింది చాలామంది సభ్యులు స్థానికమైన అనుభవాలను బట్టి, దేశంలో తమకు తెల్సిన విషయాలను బట్టి చాలా విషయాలు చెప్పారు శ్రీ సుందరయ్య గారుకూడా కొన్ని ముఖ్య సూత్రాలను గురించి చెప్పారు ఇప్పుడు యీ 10 పంటలలోనూ దేనిని కూడా తీసేయడానికి ప్రభుత్వం అంగీకరించదలచుకో లేదని మనవిచేస్తున్నాను Gradation పెట్టడానికి ప్రభుత్వం ఒప్పుకోదలచు కోలేదు ఈ రెండు విషయాలపైననే మొదటినుంచీ చర్చ జరుగుతున్నది, ఇప్పుడు మనం పన్ను వేసినవన్నీ తినే పదార్థాలే కాని పంటలో కొన్ని సరదాకు ఉపయోగింపబడేవికూడా ఉన్నాయి Casuarina 5, 6 సం॥లు పెరగవలసిన అవసరం ఉన్నది 8 సం॥ల తరువాత ఒక ఎకరంలోని సరుగుడుచెట్లను కొట్టి నట్లయితే, 2 వేల రు లకు తక్కువకాకుండా ఆదాయం వస్తుంది అక్కడ ఆదాయం accumulated గా వస్తుంది కనుకనే low rate వేయబడినది దానిమీద రు 5 లు లేక రు. 10 లు వేసినా నష్టంలేదు. 5 సం॥ల మీద రు. 5 లు యిచ్చుకుంటాడనే ఉద్దేశమే అంత low rate వేయడానికి ప్రత్యేక కారణం అయ్యింది ఇక కొబ్బరిచెట్లనుగురించి కూడా కొంతసేపు

విమర్శ జరిగింది మనం nurseries ను exempt చేసినాము కొబ్బరికాయ పాతినతరువాత మొక్క మొలుస్తుంది తరువాత దానిని విడదీసి పాతాలి ఆ తరువాత తీసుకువచ్చి తోటలో పాతాలి ఇది మూడవమాటుగాని తోటలో వేయబడదు తోటలో వేసిన దరిమిలా ఒకటి, రెండుపండ్లలో yield చేయడం ప్రారంభిస్తుంది దీంట్లో వచ్చినబాధ ఏమంటే ఆ తోటలో ఫలానా సంవత్సరం నుంచి కొన్నిచెట్లు 4 కాయలు కాస్తే అది yield చేసినట్లా, కాదా ? దీనికి test ఎలాగ ? తోటలో 100 చెట్లు వుంటే అందులో ఒక సంవత్సరం 60, 70 చెట్లు నాలుగుకాయల చొప్పున కాస్తాయి ఇది adjust చేయడం కష్టం కనుక, నర్సరీస్‌ను exclude చేశాము కనుక ఇంత low rate of tax వేశాము దీనినిగురించి ప్రత్యేకమైన చర్చ అనవసరం

కొబ్బరిగురించి నాకు తెలిసినమాట నిజమే 60 వేల ఎకరములలో మా అమలాపురం ప్రాంతంలో కొబ్బరితోటలు ఉన్నాయి అందరిమీద పన్ను వేసి మా యింటిమీద వేసుకోకపోతే తగాదా వస్తుంది కనుక కొబ్బరిమీద పన్ను వేయవలసి వచ్చింది

మన ముఖ్యమంత్రి మొదలైన మిత్రులంతా వెంకట్రావు మిరపకాయల మీద పన్ను ఎందుకువేస్తున్నాడు అని అనుకుంటున్నారు జైలులో ఒకసారి పెసరట్టు వేసిపెడతామని చెప్పి (నన్ను గేలిచేయడంకోసం అనుకుంటాను) పెసలు లేకుండా ఒక్క మిరపకాయలే వేసి అట్టు కాల్చియిస్తే నేను తినేశాను నాకు మిరపకాయలంటే ఎంతో యిష్టం కాని నేను ఏమిచేయను? కొన్నిచోట్ల మిరపకాయ అవసరం చాలఉన్నది శ్రీ నాగిరెడ్డిగారు దానినిగురించి చాలా చెప్పారు. ఎప్పుడో శ్రీనాధుడు పల్నాడుగురించి చెప్పినమాటలు చెబుతాను

"చిన్న చిన్న గుళ్లు, చిల్లర దేవుళ్ళు,
నాగులేటి నీళ్ళు, నాపచూళ్ళు,
సజ్జ, జొన్న కూళ్ళు, సర్పంబులును తేళ్ళు,
పల్లనాటి సీమ పల్లెటూళ్ళు,"

అదే ప్రాంతంమీద పన్నువేస్తే సర్పాలు, తేళ్లు పారిపోతాయని అనుకుంటున్నాను అయితే నాగార్జునసాగర్ నీటిలో నాగిరెడ్డిగారు ప్రథమ భాగస్వామి కనుక ఈ పన్ను వేసినా వచ్చే నష్టంలేదు.

వర్జీనియా పొగాకుమీదనే కాకుండా నాటుపొగాకు మీద కూడా పన్ను వేస్తున్నారని కొందరు విమర్శించారు. ఇది ఎకరానికి రూపాయి. ఎంత తక్కువ పండినా రూపాయి పన్ను యివ్వటానికి సామర్థ్యం లేనటువంటి స్థాయికి

పడిపోదు ఏ తుఫానులో పెస్టులో వచ్చి అంతా పోయినట్లయితే అసలు పన్ను తీసివేయటానికే అధికారం ఉన్నది వర్జీనియా పొగాకు సాగుకు ఎకరానికి నాలుగు, అయిదువందలు పెట్టుబడి మాత్రమే కాకుండా రు 500, 600 లు ఎక్సైజ్‌డ్యూటీ కూడా యిస్తున్నారు. ఎకరానికి రు. 800, 900 లు యివ్వ గలిగిన వాళ్ళు ఒక రూపాయి రాష్ట్రప్రభుత్వానికి యివ్వటం కష్టంకాదు

షుగర్ కేన్ విషయంలో రెండు భాగములు ఉన్నాయని చెప్పారు 1 బెల్లానికి ఉపయోగించేది 2 పంచదారకు ఉపయోగించేది అయితే ఈ డిస్టింక్‌షన్ తెలుసుకోవడం కష్టం ఏది మిల్లుకు తీసుకుని వెళుతాడు ఏది బెల్లానికి ఉపయోగిస్తాడు అనేది తెలుసుకోవడం కష్టం మిల్లువాళ్ళకు కొన్ని రూల్సు ఉన్నాయి 6 ఎకరాల తోటలో 4 ఎకరాలలోని చెఱుకు మాత్రమే వారు పుచ్చుకోవచ్చు మిగిలిన 2 ఎకరాలు విడిచి వేయడం కష్టమవుతుంది ముఖ్యంగా చిత్తూరు జిల్లానుగురించి ఇది ఆలోచించవలసి యుంటుంది ఒక్క చక్కెర మిల్లుకూడా లేదు ఆ జిల్లాలో అక్కడ స్పెషల్ కండిషన్స్‌ను బట్టి ఆలోచించుకోవలెనే గాని జనరల్ ఎక్సెమ్‌ప్షన్ ఇవ్వడానికి వీలు ఉండదు

సిట్రస్ గార్డెన్సు విషయమై హెచ్చు చర్చ అక్కరలేదు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నది 32 వేల ఎకరాలే 32 వేల ఎకరాలమీద ఎకరానికి 2 రు చొప్పున రు. 64,000 లు మాత్రమే వస్తుంది దీని వల్ల ఎక్కువ ఆదాయం రాక పోయినా ప్రిన్సిపల్ కోసం వేశాము నిమ్మకాయ కాయడం ప్రారంభిస్తే ఎకరానికి వేయి, రెండు వేలు, మూడువేలు రావచ్చు కాని ఎకరం అంతా తోట వేసేవాడు తక్కువ ఈ పన్ను హెవీ బర్డన్ కాదు అయితే మిత్రులు శ్రీ రత్నసభాపతిగారు చెప్పినట్లు 1952 లో డ్రాట్ కండిషన్స్ వల్ల రాజంపేట తాలూకాలో చెట్లు కొట్టివేసినమాట నిజమే, నేనుకూడా తిరిగాను ఆ ప్రాంతంలో కాని యింకొక విషయం మనవిచేస్తాను కోడూరులో ఫారమ్ పెట్టాము. మార్కెటింగ్ సొసైటీ పెడుతున్నారు. ఒక సబ్సిడైరీ ఇండస్ట్రీనికూడా అక్కడ ఏర్పాటు చేయడం తటస్థించింది కాబట్టి ఈ పన్ను గురించి భయపడనక్కర లేదు. ఈ పన్నును తీసివేయవలసిన ఆవశ్యకత ఉంటే ప్రభుత్వానికి అందుకు అధికారం ఉన్నది.

ఇక వేరుశనగ, ప్రత్తి మీద చాలా తక్కువ పన్ను వేశాము, ఎకరానికి ఒక రూపాయి మాత్రమే వేశాము. ఈ రెండు పంటలకు ఒక బాధ మాత్రం ఉన్నది పోయినట్లయితే మొత్తం అంతా పోతుంది. అటువంటి పరిస్థితులు

